# ఉచితం!!

## మీ అభిమాన మాస పత్రిక రేపు అందిస్తున్న ఈ సుందరమైన నూతన సంవత్సర కానుకను ఉచితంగా స్వీకరించండి!

● మీరు చందాదారులుగా చేరడానికై ఈ క్రింది కూపనును పూర్తి చేసి పంపించండి. లేదా కార్డుపై మీ చిరునామాను వ్రాసి మాకు పోస్టు చేయండి.

● పోస్టు,ప్యాకింగు ఖర్చులు మేమే భరించి మీకు దాదాపు రూ. 10/- విలువగల ఈ డైరీని ఉచితంగా వి. పి. పి. ద్వారా పంపిస్తాము.

● వి. పి. పి. తెచ్చిన పోస్టుమాన్‌కు 'రేపు' చందా నిమిత్తం రూ. 25/ చెల్లించండి. ఆ తరువాత 'రేపు మాసపత్రికను మీకు సంవత్సర పాటు పంపిస్తాము.



**మీరు ఈ క్రింది కూపనును పూర్తిచేసి పంపితే చాలు**



ఇక్కడ కత్తిరించండి

నేను రేపు మాసపత్రికకు చందాదారుడిగా చేర గోరుతున్నాను. ఈ సుందరమైన డైరీని ఉచితంగా వి పి పి. ద్వారా పంపించండి. వి. పి. పి తెచ్చిన పోస్టుమాన్‌కు రు. 25/ చెల్లించుతాను. రేపు' మాసపత్రికను సంవత్సరంపాటు ఈ క్రింది అడ్రసుకు పంపండి.

పేరు ______________________

చిరునామా ______________________

______________________

సంతకం ______________________

ఇక్కడ కత్తిరించండి

అద్భుతమైన మాస పత్రిక 'రేపు' ఇప్పటికే లక్షలాది మంది జీవితాల్ని ఉన్నతంగా తీర్చిదిద్దింది. ఒక్క సంవత్సరంలో మీకు నూతన జీవితాన్ని వాగ్దానం చేస్తోంది.

**రేపు**
విజయవాడ-520 002

కేటలాగు కావాలంటే రు. 2/- లు M.O. చేయండి.




## ముఖచిత్రం

30—11—79 తేదీ సంచిక అందాలనటి దీప ముఖచిత్రం చాలా ఆకర్షణీయముగా ఉంది.

బి లక్ష్మణశాస్త్రి [ భీమవరం ]

*  *  *

ఈవారం 30—11—79 విడుదల అయిన నవనీత, అందాల ముద్దులొలికే సుందరి దీప సుమధుర శృంగార వయ్యారాలతో ఒలికిన ముఖచిత్రం గల ఆంధ్ర సచిత్ర వారపత్రిక ఎంతో అందంగా, ఆకర్షణీయంగా నన్ను [అందర్నీ] మురిపించేలా వచ్చింది.

ప్రతీవారం ఇంకా అందాలతో కూడిన, నీటైన ముఖచిత్రాలే లభిస్తాయని ఆశిస్తూ మన[మీ] పత్రికకు అభినందనలు.

ఎస్ ఆదిబాబు,విజయనగరము.

## శీర్షికలు

దీప ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక ఎంతో ఆకర్షణీయంగా ఉంది.ఎన్నోవిజ్ఞానదాయకమైన విషయాలను తెలుసుకొన్నాము.

ఎస్. తిరుపతిస్వామి, వేములవాడ.

*  *  *

ముఖ్యంగా మీరు సామాజిక స్పృహ కలిగించిన నవచైతన్యాన్ని ప్రతిబింబించే కవితలు ప్రచురిస్తున్నందులకు మీకు మా అభినందనలు.

టి. కె. సెల్వకుమారి, పిద్దవటం.

## కథలు

30—11—79 దీప ముఖచిత్రంతో వెలువడిన సచిత్ర వారపత్రిక చూడముచ్చటగా ఉన్నది. ఇందు నీడ పొడుగు, ఆలంబన, మంచుతెర, ఈకథలు చాల బాగున్నవి.

ఆలమూరి థామసుడేనియల్, సుదాకరుశామ్యూల్ [విశాఖపట్నం]

## సీరియల్

మా అభిమాన తార దీపముఖచిత్రంతో వెలువడిన 30—11—79 నాటి ఆంధ్ర సచిత్ర వారపత్రిక చూడముచ్చటగానున్నది. సుదూర తీరాలు సీరియల్ చాలా ఇంటరెస్టుగా ఉన్నది.

ఉప్పల బేబిసరోజిని, నాగాయలంక.

*  *  *

9—11—79 సుజాత ముఖచిత్రంతో వెలువడిన నా ప్రియమైన ఆంధ్రసచిత్ర వారపత్రిక చాలా బాగుంది. రాజనారాయన్‌జీ! గుప్పకుర్రచేష్టలు మా నెయ్యాలి కార్టూన్ కడుపుబ్బ చేసింది. పాటిబండ్ల విజయలక్ష్మి రచించిన సుదూర తీరాలు మొదటి వారం నుండి ఇంటరెస్టింగ్‌గా ఉంది, ఈ వారం మలుపు మనసు కదిలించేలా ఉంది.

జంబు, కేరాఫ్ 99 ఏ. పి. ఒ.

*  *  *

సీరియల్ ప్రాక్టీసు పెట్టిచూడు చాల ఇంటరెస్టుగా యున్నది. కథలలో కర్తవ్యం కథ బాగున్నది.

సి. ఎస్. రవికాంత్ [కర్నూలు]

*  *  *

ప్రాక్టీసు పెట్టిచూడు శ్రీరంగంగారి హాస్యనవల చాలా జాలీగా నవ్వొచ్చేటట్లు ఉంది. ఈ పత్రికలో ఇంకోసారి రా కథ చాలాబాగుంది సుదూరతీరాలు సీరియల్ రసవత్తంగా ఉందని వేరే చెప్పక్కర్లేదు. కార్టూన్లు చూసి నవ్వు ఆపుకోలేక పోతున్నాము.

పూడిపెద్ది పార్వతీరావు, హైద్రాబాద్.

*  *  *

ఆలంబన కథ చాల బాగుంది. ప్రాక్టీసు పెట్టిచూడు సీరియల్‌లోని మా అభిమాన రాగతి పండరి కార్టూన్‌లు మాకు చాల వినోదాన్ని కలిగిస్తున్నాయి.

ఇందుముఖి, సోమందేవపల్లి.



# "నాలో ఎటువంటి ఆందోళన వున్నా అది నా శాంత వివాహం జరగడానికి నెలరోజుల ముందరే తగ్గిపోయింది."

—అన్నారు శ్రీ గుప్తా,* పాఠశాల ఉపాధ్యాయుడు, కాన్పూర్ బ్రాంచిలో ఎకౌంట్ హోల్డర్.
ఇండియన్ బ్యాంక్ రొఖ్కం సర్టిఫికెట్టు పథకంవలన శ్రీ గుప్తా వలె మీరు
మీ అదృష్టాన్ని పెంపొందించుకోవచ్చు. ఆ వాస్తవ గాథ చూడండి.

"ఒక పెళ్ళి సంబంధం కుదర్చాలంటే లక్ష మాటలతో పని అనే సామెతవుంది. అయితే అది 'లక్ష రూపాయల' పని అని నేనంటాను. తగిన ఏర్పాట్లన్నీ చేసుకున్నా, నా ఏకైక కుమార్తె శాంత వివాహానికి ముందర నాకూ అలాగే అనిపించింది. 10 సంవత్సరాల క్రితం నేను చేసిందేమిటంటే, నేను రూ. 4000కి ఒక రొఖ్కం సర్టిఫికెట్టు కొన్నాను, అప్పుడు అది ఒక రోజున కలసి వస్తుందనుకున్నాను. శాంత వివాహం హఠాత్తుగా జరగవలసిరావడంతో అది నిజంగానే కలసివచ్చింది. నాలో ఎటువంటి ఆందోళన వున్నా అది నా శాంత వివాహం జరగడానికి నెలరోజుల ముందరే తగ్గిపోయింది."

## శ్రీ గుప్తా అనుభవంతో లాభం పొందండి

శ్రీ గుప్తా వలె ప్రయత్నం ప్రారంభించండి మీ దగ్గరిలోనున్న ఇండియన్ బ్యాంక్ బ్రాంచి మానేజర్‌ని చూడండి. మీకు సలహా యివ్వడానికి సరియయిన వ్యక్తి ఆయనే.

## ఇండియన్ బ్యాంక్ యొక్క 10 లాభదాయకమయిన పథకాలు

● రొక్కం సర్టిఫికేట్టు ● పదవి విరమణ పథకం ● రికరింగ్ డిపాజిట్ ● చిన్న మొత్తాల డిపాజిట్ ● ఫిక్సెడ్ డిపాజిట్ ● అగత్య డిపాజిట్ ● స్వగృహ నిర్మాణ పథకం ● నాన్ రెసిడెంట్ విదేశీ ద్రవ్య ఖాతా ● మరల పెట్టుబడిగా మారే పథకం ● పొదుపు ఖాతా.

*అసలు పేర్లు రహస్యంగా వుంచాలనే వుద్దేశంతో ఇక్కడ పేర్లు కల్పించబడ్డాయి.



**ఇండియన్ బ్యాంక్**

**మీ సుఖసమృద్ధికి సహకారి**

31 రాజాజీ రోడ్ మద్రాసు 600 001

JAA/IB/774 Tel

## లోకం పోకడ — ఊమెన్











**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938 – 1972]

శుక్రవారం : 21-12 '79
సిద్ధార్థినామ సం. పుష్య శు. విదియ
సంపుటము 73 · సంచిక 17

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41-60
ఆరు మాసాల చందా రు. 20-80
విడి ప్రతి వెల 75 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

అట్టమీద బొమ్మ :
'ఛాలెంజి రాముడు'లో జయప్రద

**కథలు :**



**సీరియల్ కథలు :**



**వ్యాసాలు, శీర్షికలు :**




# వయసు-మనసు

తులసి బాలకృష్ణ

టక టక టక —

"ఎవరండీ ?"

"... ... ..."

టక టక టక—

"ఎవరదంటే ?"

"... ... ..."

టక టక టక—

"అరె ఎవరదంటే మాటాడరేం ?"

—'ఎవరంటె ఏంచెప్పాలో అర్థంగాక కొంత, మాడ్చే ఎండలో వచ్చిన కారణంగా గొంతు పూడిపోయి కొంత, ఒళ్లు మండిపోయి 'తలుపు తీయవమ్మా- నీ యింటి వ్వేనేం దోచుకుపోనూ- ఎవడు మొదలెట్టాడో గానీ తలుపు తీయకుండానే బెదరగొట్టెయ్యడమనేదొక దరిద్రపు అలవాటు' అని సణిగాడు శంకరం కోపంగా. ఆ పైన, యింకోసారి—

టక టక టక—

—ఛళ్ళున తెరుచుకున్నాయి తలుపులు.

బెదిరాడు శంకరం— తలుపులు తెరిచిన ఆడమనిషి ఆకారం చూసి. రేగిన జుట్టు, చెదిరినబట్టలు, చికిలించిన చింతనిప్పుకళ్ళు, ముఖంలో విసుగుదల - నిద్దర్లోంచి వచ్చినట్లుంది ఆవిడ.

"చలం వున్నాడండీ యింట్లో ?"— బెదురుతున్నట్లుగా అడిగాడు శంకరం.

"లేడు-" ధనేల్మని మూసుకున్నాయి తలుపులు.

బిత్తరపోయేడు శంకరం. ఆ పైన చిన్నబోయేడు. నెమ్మదిగా వెనుదిరిగాడు. ఇందాక తనెక్కి వచ్చిన బస్సు కొంపలు ఆర్పడానికి వెళ్తున్న ఫైరింజన్లా దూసుకుపోయింది. 'ఆపవోయ్ దేవుడా' అని అరుద్దామనుకున్నాడు గానీ గొంతు పెగల్లేదు.

'ఈ బస్సు దాటితే మరో రెండు గంటల దాకా బస్సు లేదీ కాలనీకి. మెయిన్ రోడ్డుకి మైలు దూరం వుంది. ఇది కాలనీ కాదు- ఛి ఛీ— ఎడారికన్నా అధ్వాన్నం. గొంతెండి చస్తున్నా మంచినీళ్ళు కూడా పుట్టవు. బందిపోటు దొంగలు వడి యింతోటి వీళ్ల భాగ్యం లూటీ చేసుకుపోతారనే భయమో ఏం పాడో ప్రతివాళ్ళూ యిరవైనాలుగ్గంటలూ తలుపులు బిడాయించుక్కూర్చుంటారు. కాఫీ హోటల్ కాదు కదా కిళ్ళీషాపైనా వుండదు. మహాతల్లి— గొప్ప మర్యాదస్తురాలే ఎండన పడొచ్చాడు మానవుడు — ఓ నిముషం నీడపట్టున కూర్చోనిచ్చి, గుక్కెడు మంచి నీళ్లయినా గొంతులో పోద్దామనే కనీస మర్యాద కూడా తెలీదు'— సణుగుడు, గొణుగుడు ఆ పైన నడక.

ఫర్లాంగు దూరం నడిచి, 'చిన్న రోడ్డె'క్కాడు. ఆ రోడ్డు మీద ఏదో బస్సు గంటకోసారి వడుస్తుంటుందని విన్నాడు. ఈ టైములో వుందో లేదో తెలీదు. సరిగ్గా నడినెత్తి మీద వున్నాడు మార్త

భగవాన్లు. నెత్తిని చీల్చుకుపోయి మెదడుని ముద్దెట్టుకుంటున్నాయి అతగాడి అస్త్రాలు. రయ్యిన వేడిగాడ్పులు కొడుతున్నాయి. కర్ణకఠోరమైన కాకుల అరుపులు తప్ప మరో ధ్వని వినపడట్లేదు. చుట్టూ నరమానవుడెవడూ లేడు. నెత్తిమీద చేతులు పెట్టుకుని, చుట్టూ కలియజూశాడు. ఒక యింటి గోడ ప్రక్కగా వున్న కొద్దిపాటి నీడలో రాయిమీద కూర్చునివున్న ఒక జడ శాల్తీ శంకరం కళ్లలో పడింది.

లాంగ్‌షాట్లో కూడా ఆకర్షణీయంగా వుంది ఆ యువతి. ఆ వనిత ఎడారిలో ఒయాసిస్సులాగ, కొండల్లో కొబ్బరి బోండాం లాగా కనబడింది శంకరానికి. ఆమె కూడా బస్సుకోసమే ఎదురుచూస్తోందనీ, తను పలకరించినా సందర్భాన్ని బట్టి తప్పు పట్టదనీ తెలుస్తోంది. తనెప్పుడూ అమ్మాయిలతో మాట్లాడి యెరుగడు కానీ మాట్లాడాలనే వుత్సాహం వుంది. వాళ్లేమనుకుంటారో ననే భయమూ వుంది.

అటు వెళ్దామా వద్దా అని తటపటాయించి, నాలుగడుగులు ధైర్యం వచ్చే వరకూ అటూ యిటూ నడిచి, గబగబా ఆమె వైపు నడిచాడు.

ఆ లలన తెలుపుమీద పూలున్న వాయిల్ చీర, లేత నీలం రంగు జాకెట్టు కట్టుకుని వుంది. తెల్లరంగు పెద్ద కళ్లజోడు పెట్టుకుంది చేతిలో పుస్తకాలున్నాయి. ప్రక్కనే చిన్న వాటర్ బాటిల్ వుంది. ముఖంలో అలసట వుంది మెడచుట్టూ ముత్యాల్లాంటి చెమట వుంది కళ్లల్లో ఎర్రజీర వుంది. బుగ్గల నిండా ఎండకు కందిన ఎరుపుంది. అప్పటికీ డామినేట్ చేస్తూ, ఒంటరితనపు బెదురుంది. దాన్ని అధిగమించి ధైర్యంగ వున్నట్లు కనిపించాలని చేస్తున్న ప్రయత్నముంది ఇరవైలోపు వయసుంది.

మగవాసన దగ్గరవుతూండగా పమిట సర్దుకూర్చుంది ఆమె.

కళ్లతో ఆమె అందాన్ని జుర్రుకున్నాడు శంకరం

"ఎక్స్‌క్యూజ్ మి- ఇటు పోలీస్ స్టేషన్ వైపు వెళ్లే బస్సు వెళ్ళిపోయిందా?"— శంకరం గొంతు కొద్దిగా వణికింది.

'లేద'న్నట్టుగా తలాడించింది ఆమె

"థాంక్యూ" అని, ఏం చెయ్యాలో తోచక, తిరిగి వచ్చిన స్థలానికే పోనవసరం

# వయసు-మనసు

లేదనిపించి. కొంచెం ఎడంగా నిల్చుని, ఎండని భరించలేక, సూర్యుడివైపు కోపంగా ఆ అమ్మాయి వైపు జాలిగా చూశాడు శంకరం.

శంకరం నుండి చూపు మరల్చి ఆమె ప్రక్కనున్న నీడవైపైన నిలిపింది ఆ చూపులో 'ఈ నీడలో నిల్చోవచ్చు మీరు' అనే సలహా వున్నట్లు గమనించాడు శంకరం.

"ఈ టైముకి బస్సుందనుకుంటాను" వణుకు రాకుండా అడిగాడీసారి.

"తెలీదండి"— అంటుకుపోయినట్టున్న పార్లెబిళ్లాంటి ఆమె పెదవులు విడుతూంటే ముచ్చటేసింది శంకరానికి ధైర్యం చేసి మాటలు పొడిగించాలని నిర్ణయించుకున్నాడు. ఒంటరితనాన్ని ఆమె భరించలేకపోతోందని గ్రహించాడు. అందుకనే వదిలించుకోవాలన్నట్లుగా కాకుండా తనవైపు చూస్తూనే మాట్లాడింది బస్సు రాకుండా వుండాలని కోరుకున్నాడు మరో నిమిషానికైనా వస్తే చంపి పారెయ్యాలని కూడా అనుకున్నాడు అప్పటికి మించి ఆమె తన మాటల తీరుని చూసి బెదిరిపోకుండా జాగ్రత్తపడాలని నిర్ణయించుకున్నాడు. లేకపోతే ఆ అమ్మాయి బెదిరిపోయి, యింటికి వెళిపోతుంది. అసలా అమ్మాయి యీ కాలనీలోనే వుంటోందో ఎక్కడ్నుంచైనా వచ్చిందో?!

ఆ విషయమే అడిగాడా అమ్మాయిని.

"లేదండీ- నేను చిక్కడపల్లిలో వుంటాను ఇక్కడ మెడిసిన్ చదువుతున్న మా ఫ్రెండొకామె వుంది ఆమెను కలుద్దామని వచ్చాను తను లేదుట ఇంటికి వెళిపోతున్నాను ఈ రోడ్డు మీద కొన్ని బస్సులు దొరుకుతాయని అప్పుడెప్పుడో తనే చెప్పింది అప్పుడే హాఫెనవర్ నుంచి వెయిట్ చేస్తున్నా. బస్సుల్లేవు."

తల ఆడించి, ఒక నిముషం పాటు వాచీని, బస్సువచ్చే దిక్కుని చూసి, [illegible] "బస్సొస్తే బాగుణ్ణు త్వరగ" అని సన్నగ ఆమెకు వినిపించేలా గొణుక్కున్నాడు శంకరం. అందులో- తాను కావాలని మాటలు పొడిగించడంలేదని ఆమె గ్రహించాలనే తపన వుంది- అంతకు మించి నటన వుంది.

ఆ తర్వాత—

"ఆ రూట్‌లో బస్సులు సరిగ్గా టైముకి తిరగవండి. ఒక్కోసారి రోజూ వచ్చేబస్సుకూడా క్యాన్సిల్ చేసేస్తూంటాడు. పోలీస్ స్టేషన్‌దాకా ఎలాగోలా వెళ్ళిపోతే అక్కణ్ణుంచి చాలా బస్సులుంటాయి." అన్నాడు.

"అదెంత దూరం వుంటుందండీ ?"

"దగ్గరే...దగ్గరంటే నాకు దగ్గర. మీలాంటి వారు కొంచెం అలసి పోతారు" నవ్వాడు. ఆమె కూడా నవ్వింది. ఆ తర్వాత ఏదో అనబోయి, విరమించుకుంది.

"ఈ బస్సు కోసం నేను గంటలతరబడి ఎండలో పడిగాపులు పడ్డ రోజులున్నాయి." అంటూ, బస్సు వస్తున్న చప్పుడువిని, ఉలిక్కిపడ్డాడు శంకరం. ధ్వని దగ్గరవుతూండగా నిరుత్సాహపడి పోయాడు.

మలుపు తిరిగిన లారీ రివ్వున దూసుకుపోయింది.

'హమ్మయ్య' అనుకున్నాడు.

ఓ నిముషం మౌనం.

"క్షణానికోసారి గొంతెండి పోతోందండి" అన్నాడు గుటక మింగుతూ.

"ఓ సారీ— వాటర్ వుంది నా దగ్గర. ఆఫర్ చెయ్యడం మరిచాను. అందు తీసుకోండి" అంటూ బాటిల్ అందించింది. బాటిల్ ఎత్తి, చల్లటి నీటిని ఆగి ఆగి తాగుతూ, ఆమె అందాన్ని ఓరకంట ఆస్వాదిస్తూంటే స్వర్గంలో ఉన్నట్టుంది శంకరానికి.

"రాని బస్సుకోసం యీ ఎండలో యిక్కడ వెయిట్ చెయ్యడంలో మీనింగ్ లేదేమో కదా ?!" బాటిల్ అందుకుంటూ సలహా కోరిందామె—నవ్వుతూ.

"ఏం చేద్దామంటారు ?" అన్నాడు శంకరం వుత్సాహంగా.

"ఆ పోలీస్ స్టేషనేదో అక్కడి వరకూ లెఫ్ట్ రైట్ కొడితే ?"

"ఓయస్—అయామ్ రెడీ టు గివ్‌యు కంపెనీ, ఇఫ్‌యూ వాంట్" — మరింత వుత్సాహం వుంకలేసింది శంకరంలో.

"ప్లీజ్." తమాషాగా నవ్వుతూ, అభ్యర్థిస్తున్నట్టు చూసింది ఆమె. ఆమె ప్రతి చూపూ తనని ఆమె వైపు లాగుతోంది. గులాబీ అత్తరు పరిమళం ఆమె చూపులో.

కర్చీఫ్‌తో మెడచుట్టూ తుడుచుకుని, కళ్ళకు గాగుల్స్ తగిలించుకుని, లేచి నిల్చుంది ఆమె.

పూర్తిగా ధైర్యంవచ్చేసింది శంకరానికి. ఆమె ప్రక్కనే నడవసాగాడు. ఆమె కూడా అతనికి అతిచేరువలోనే అడుగులేయసాగింది.

అడుగులు...

ఆమె ప్రక్కనే ఏడడుగులు వేసేసరికి ఒళ్ళు తిమ్మిరెక్కింది శంకరానికి.

"మీ కభ్యంతరం లేకపోతే నా హ్యాండ్ బ్యాగ్‌లో నేప్‌కిన్ వుంది - ముఖం తుడుచుకోండి" అంది అతని ముఖం మీద పొటమరించిన చెమటని చూస్తూ. చెమటన్నీ విండని, అనల్పవపంచాన్ని 'కేర్' చెయ్యనట్టు అందంగా నవ్వేడు శంకరం.

బ్యాగ్‌లోంచి నేప్‌కిన్ తీసి, అందించింది.

మల్లెపువ్వులాంటి తెల్లటి నేప్‌కిన్ గుప్పుమని సెంటు వాసనని వెదజల్లింది. విస్ఫారిత నాసికాపుటాలతో ఎగబీలుస్తూ, నేప్‌కిన్‌ని మనసారా, మెత్తగా ముఖానికి హత్తుకున్నాడు. యథాలాపంగా చేస్తున్నట్టు నటిస్తూ, తన గుండెలమీదకు వచ్చి జార్చుకుని, హృదయానికి హత్తుకుని, తన్మయుడయ్యాడు.

తనూ అమ్మాయిల్ని ఆకర్షించ గలడన్న మాట. 'సో- ఐయామ్ సెకండ్ టు నన్ యిన్ దిస్ మాటర్ ఆల్సో' అనుకున్నాడు ఆనందంగా.

"మన గమ్యం చేరేలోగా ఏదైనా మాట్లాడుకుందామా ?"— చిలకపలుకులే.

"తప్పకుండా—ముందుగా - యువర్ స్వీట్ నేమ్ ప్లీజ్"

"సునయన."

"ఏ స్వీట్ నేమ్ టు ది స్వీట్ గాళ్"

"థాంక్స్" అంటూ పెదవులు ముద్దుగా కదిలాయి.

"హోమ్ సైన్స్ కాలేజీలో బియస్సి పూర్తిచేసాను."

"అయితే—మళ్ళీ పుస్తకాలు...?"

"నావెల్స్"

"ఫ్యూచర్ ప్లాన్స్ ?"

"నాట్ ఎట్ డిసైడెడ్"

"ఉం...మ్యారేజా ?"

"ఓ ! నో..." బుగ్గలు ఎర్రగా పూశాయి.

ఆ సిగ్గుని చూస్తూంటే శంకరం ఎదలో సరిగమలు మొదలయ్యాయి. రెస్పాన్స్ బాగుండేసరికి ధైర్యం పెరగసాగింది - "ఆ వంటలచదువు చదివారేం?"

"హోమ్ సైన్స్ అంటే వంట లొక్కటేకాదు ఆడపిల్లలకు చాలా వుపయోగ పడుతుంది ఆ చదువు. ఐ లైక్‌ట్ సిన్స్ మై చైల్డ్‌హుడ్. డాడీ ఆల్సో వాంటెడ్ మి టు డు యిట్"

—ఓ నిముషం మౌనం.





"ఇంతకీ లైఫ్ పార్ట్నర్ విషయంలో మీ అభిప్రాయం ?"—శంకరం.

"అంటే ?"

"అంటే ఏముంది - ఎలాంటి వాడ్ని మీ పార్ట్నర్‌గా కోరుకుంటున్నారు ?"

"... ... ..."

"సిగ్గే సమాధానమా ?"

'భంయ్' మని శబ్దం చేసుకుంటూ వెనక్కి వచ్చిన లారీకి దారి ఇవ్వడానికి గబుక్కున ఆమె జరగడంతో భుజాలు రాసుకున్నాయి.

ఒళ్ళు పులకరించింది శంకరానికి

"ఓ- సారీ..." అంటూ ఆమె అందంగా బాధపడింది.

మరో వంద లారీలు అలాగే రావాలని కోరుకున్నాడు శంకరం.

చిన్న చిన్న అడుగులు... బరువుగా ... బాధగా...

"నిజానికి ఈ నాటి వాళ కొంత 'క్లౌడీ'గా వుంది కాబట్టి ఈ మాత్రం చల్లగా వుంది. రోజూ అయితే ఎండ అసలు భరించలేము" అంది సునయన, తమాషాగా తల ఆడిస్తూ.

లోలోనే నవ్వుకున్నాడు శంకరం—'నా సహచర్యం నీకు సూర్యుడి మీద నిల్చున్నా, వాసంత సమీరాన్ని, హేమంత తుషారాన్ని మరిపింప చేస్తుంది పిల్లా' అనుకున్నాడు.

"అన్నట్లు మీ పేరు ?" గబుక్కున అడిగింది— మర్చిపోయినదేదో ఒక్కసారిగా గుర్తొచ్చినట్లు.

"భీమశంకరం"

"బాగుంది" అనలేదు ఆమె. తలూపింది అంతే.

చిన్నబుచ్చుకున్నాడు శంకరం తనకు ఎంతో మంచి పేరు బాగుందనిపించింది.

"ఏం చేస్తున్నారు ? ఈ కాలనీకి ఎందుకొచ్చారు?"

"నేను రేడియో స్టేషన్‌లో 'క్లెర్క్'గా పని చేస్తున్నా. మీలాగే నా ఫ్రెండొకడ్ని కలవడానికి వచ్చాను ఆ యిడియట్ లేడు. మీ పరిచయ భాగ్యం లభించింది. ఐ థాంక్ గాడ్."

"సేమ్ టు యు"

"నడక భారంగా వుందా ?"

# వయసు-మనసు

"అబ్బె, అదేం లేదు."

"ఉ... నా కంపెనీ బోరుగా ఉందా?"

"చ ఛ.... అదేం లేదు. "

"థేంక్యూ."

—అడుగులు... చిన్న చిన్నవి...

"ఇదిగో— అరణ్యంలా పెరిగిన ఈ తోట చూసారా? దీని గురించి చాలా కథలు చెబుతారు. అసలీ వేళల్లో ఈ రోడ్డు మీద ఆడవారు కాదు కదా, మగవారుకూడా నడవడం డేంజర్స్."

బెదురు చూపులు చూసింది ఆమె. రోడ్డు పొడుపునా వెనక్కి ముందుకీ గబగబా చూసి, శంకరం కళ్ళల్లోకి సూటిగా చూసింది.

నవ్వేడు శంకరం.

## విప్లవం ?!

కాలేజీ ప్రాంగణంలో
విద్యుద్దీపమ్ము వెలుగుకొని
నిలబడ్డది తియ్యమామిడి చెట్టు !
మత్తుగా వచ్చేపోయే
అమ్మాయిలవైపు పోజులిస్తున్నారు
ఆ చెట్టిచ్చిన ఆశ్రయంతో
గణగణ గంట వినిపించింది
చెదురుమదురయ్యారు.
పరీక్ష హాల్లోకి వాళ్ళు
ఏకలవ్యుణ్ణి
పట్టేశాడు ద్రోణుడు
కాపీ కొడుతోండగా
క్రోధం పెరిగింది
కళ్ళెర్రబడ్డాయి
ఏకలవ్యుడికి
విరుచుకుపడ్డాడు "పులి" లాగ
ద్రోణుడి మీదికి
అతని చేతిలోని 'చిరుకత్తి'
కసుక్కున కోసేసింది
కాపీ పట్టుకున్న ద్రోణుడి
బొటనవేలను
పారిపొయ్యాడు ఏకలవ్యుడు
మ్మొర్రో మ్మొర్రో మంటున్నాడు
ద్రోణుడు పారిపోయాడు
ఏకలవ్యుడు అక్కణ్ణించి.

— తూములూరు కార్తికేయశర్మ.

"అబ్బె మీరేం భయపడక్కాగేదు లెండి. ఇద్దరం పుగ్గాంగా ప్లైగా ఆల్మోస్ట్ మన గమ్యం వచ్చేసినట్లే— ఐ మీన్— గమ్య 'స్థలం' వచ్చేసినట్లే"

"ఇద్దరం అన్నా నన్ను లెఖ్ఖ పెట్టొద్దు. మీరు ప్రక్కన వున్నారనే కొండంత ధైర్యంగా వుంది."

ఆనందంతో నిండిన శంకరం గుండెలు పుబికాయి.

అంతకన్నా ఏ ఆడపిల్ల తన మనసుని విప్పి చెప్తుంది- గ్రీన్ సిగ్నల్

బ్యాగ్‌లోంచి కమలాఫలం తీసి ఒలవ సాగింది ఆమె.

"ఓహో- మీరు చాలా లగేజీ తీసుకుని బయల్దేరేరే" అన్నాడు శంకరం.

"ఇదిగో ఇలాంటి సందర్భాల్లో అవసరానికి పనికొస్తాయని కొంత జాగ్రత్త పడతాను." అంటూ నవ్వి తొనలు వలిచి, ఒక్కటొక్కటే అతనికి అందించసాగింది. అవి అందుకుంటూండగా వేళ్ళు తగిలాయి. అతని స్పర్శ అలవాటు పడ్డదానిలా ఆమె ఏ భావం చూపించలేదు. కావాలని మరో రెండు సార్లు ఆమె వేళ్లని తాకాడు శంకరం.

గమ్యస్థలం కనుచూపు కందుతోంది.

"రేడియో స్టేషన్‌కి వస్తూండండి- యిదే మన ఆఖరి కలయిక అయిపోవడం నా కిష్టం లేదు."

"తప్పకుండా. ఆటు వైపు తరుచు వస్తూనే వుంటాను కూడా."

"సంతోషం. మన స్నేహం మరింత బలపడ్డాక నేను మీ యింటి కొస్తాను. మగ పురుగుల్ని మీ యింట్లోకి రానిస్తారా— గెంటేస్తారా ?"— నవ్వాడు.

"ఛా ఛా ఛా ఎవర్నైనా ఏం చేస్తారో చెప్పలేను గాని మిమ్మల్ని మాత్రం నాడి తప్పక లైక్ చేస్తారనే నమ్మకం నాకుంది."

"థాంక్స్. అదుగో ఆ కనిపిస్తున్నదే పోలీస్ స్టేషను."

"అంటే మన గమ్యమున్నమాట."

"ఆహం అలా అనెయ్యకండి. ప్లీజ్."

"ఏం ?"

"అంతే."

"ఓ — సరే ..." అర్థమయినట్లు తలాడిస్తూ అంగీకారంగా నవ్వింది

"ఇక్కడ కూల్‌డ్రింక్ షాపుకూడా లేదు. మీబాటిల్‌లో నీళ్ళన్నీ నేనేతాగేశాను." నొచ్చుకుంటూ, బస్‌స్టాప్ దగ్గరపడుతున్నందుకు ఏడుపు దిగమింగుకుంటూ అన్నాడు.

"ఒద్దులెండి- డైరెక్ట్‌గా యింటికిపోతే అన్నీ సమకూరతాయి."

"బస్ స్టాప్ వచ్చేసింది" అన్నాడు శంకరం బాధగా.

"అవును" అంటూ తలొంచుకుంది.

"ఇంటికి వెళ్ళాక నాతో మీ ఎక్స్‌పీరియన్స్‌ని లెటర్ రూపంలో నాకు అందజేయగలరా మిస్ సువయనా?"

"లెటరా?! లెటరే! యూఆర్ వెరీపూర్ ఇన్ రైటింగ్ లెటర్స్. సారీ. అయినా మీ ఆఫీసుకే వస్తానన్నానుగా."

రుయ్యమని బస్సొచ్చి ఆగింది.

"ఓ ఇది చిక్కడపల్లి పోతుంది. మరి యీ బస్సులో వెళ్ళడానికి నాకు శలవా? హౌ డు ఐ టేక్ లీవ్ ఫ్రమ్ యు మిస్టర్ భీమశంకరం?"

"ఊఁ... వెళ్ళొస్తారా- ఓ కె... తప్పకుండా మా ఆఫీసుకి రావాలసుమా?"

"ఓ. కె."

"ప్రామిస్"

"ప్రామిస్"

"గుడ్‌బై"

"గుడ్‌బై"

# వయసు మనసు

బస్సెక్కి చెయ్యూపింది. ఆమె కళ్ళు నక్షత్రాల్లా మెరుస్తున్నాయి.

క్షణంలో దూసుకుపోయింది బస్సు. తన మీదుగా దూసుకుపోయినట్లు ఫీలయ్యాడు శంకరం. కార్నర్‌సీట్లో కూర్చుని కిటికీ మీద తల వాల్చి, ఆలోచనల్లో పడింది సువయన. ఏదో గుర్తొచ్చి, లోపల్నుండి నవ్వు తన్నుకొస్తుండగా, పంటి వెనక అదుపుచేసి, శంఖంపూరించినట్లున్న బుగ్గల్లో మొహాన్ని చేతుల్లో దాచుకుంది.

ఇంటికి చేరాక ప్రేమగా అన్నం వడ్డిస్తున్న భార్య ముఖంలోకి చూస్తూ, తనని తాను తెగతిట్టుకున్నాడు శంకరం. ఒకటి- తనకు దేవతలాంటి భార్యవుండీ మరో అమ్మాయి మీద మనసు పడ్డందుకు. రెండు- ఆ విషయం చెప్పకుండా 'ఆ అమ్మాయి' మనసుని తనకు అర్పించుకునేందుకు తనే కారణమయినందుకు. 'పూర్ గర్ల్. మళ్ళీ కంటబడకుండా వుంటే బాగుండును. ఐ విష్ హర్ ది నైస్ బెటర్ హాఫ్' అనుకున్నాడు.

* * *

మర్నాడే ఆఫీసుకి లెటరొచ్చింది శంకరానికి.

హలో మిస్టర్ శంకరం—

హౌ ఆర్ యు?

మీ పరిస్థితిని వర్ణించనా? - మనసుని ఎక్కడో పారేసుకున్నట్టున్నది. ఏ వస్తువు చూసినా నా రూపమే కనిపిస్తోంది. ఏ పువ్వుని చూసినా నా నవ్వులాగే వుంది. ప్రతి క్షణం నేనే మీ కళ్ళముందు నిలబడ్డట్టువుంది అవునా?

క్షమించాలి— ఇందులో సగం బాధ్యత నాదీ వుందని నాకు తెల్సు. కాని... నేను మిమ్మల్ని... ప్రేమించడం లేదంటే.. తిట్టిన తిట్టు తిట్టకుండా తిడతారా? బస్‌స్టాప్ వరకు తోడు వచ్చినందుకు చాలా థాంక్సు. అయితే నా ప్రవర్తన అంత చనువుగా కాకుండా రిజర్వ్‌డ్‌గా వుండొచ్చుగా అని మీరనవచ్చు. ఆ సమయంలో ఎలాగోలా యింటికి చేరవలసిన అవసరం నాకుంది, సర్. ఆ మాత్రం చనువుగానైనా మీతో లేకపోతే నాకు మీరు సాయపడతారా? అసలు నా గురించి పట్టించుకుంటారా- నిజం చెప్పండి. పైగా ఆపద సమయాల్లో (రియలీ- ఆ మండు టెండలో, నిర్జన ప్రదేశంలో, ఒంటరిగా నాలాంటి ఆడపిల్ల వుండవలసి రావడం ఆపద సమయం కాదంటారా?) మగవాడ్ని నమ్మితే ఒక చిక్కు, నమ్మకపోతే ఒక చిక్కు. మనిషిని చూడగానే స్వభావం ఎలా కనిపెట్టగలం చెప్పండి. కాని కొద్ది మాటల్లోనే మీకున్నది చెడు వుద్దేశ్యం కాదని, నన్ను లైక్ చేస్తున్నారని అర్థం చేసుకున్నాను. కొద్దిగా చనువుగా వుండి, కనీసం మాటలతోనైనా మీకు ఆ మాత్రం ఆనందం అందించడంలో తప్పు లేదనిపించింది.

పైగా— సారీ— ఇక మనం కలవబోవట్లేదు. రేపే మేము బొంబాయి వెళ్ళిపోతున్నాం. ఇంకొక ముఖ్యమైన విశేషం— మా 'ఉడ్ బి' మీ సాయానికి మీకు థాంక్స్ చెప్పమన్నారు.

మీరు నన్ను బహుశా క్షమించరేమో— నా పేరు సువయన కాదు. మేం చిక్కడపల్లిలో వుండడం లేదు. నేను హోంసైన్సు కాలేజీలో చదవలేదు.

ప్రమాదంలో బయట పడగల ఒక తెలివైన అమ్మాయిగా మాత్రం నన్ను అర్థం చేసుకుని, క్షమిస్తారో, మెచ్చుకుంటారో— మీ యిష్టం.

ఈ లెటర్ వరకూ మాత్రం నా పేరు 'సువయనే.'



# ఎరుకలోని తెగలు

— బులుసు వేంకటరమణయ్య

ఎరుక అంటే జ్ఞానం. ఎవరైనా తెలివి తక్కువ పని చేస్తే "నీకు బుద్ధి, జ్ఞానం లేవా?" అని నిందిస్తారు. ఇలా తెలివైనవారూ, తెలివి లేనివారూ అని మనుష్యుల్లో రెండు రకాలవారున్నారు. వారే జ్ఞానసహితులు, జ్ఞానవిహీనులున్నూ.

జ్ఞానం, బుద్ధి, ప్రజ్ఞ, ప్రతిభ అనేవి ఇంచుమించుగ ఒక్క అర్థంలోనే వాడబడుతూ ఉన్నాయి. కాని వీటికి పరస్పరం వ్యత్యాసం ఉండనే ఉన్నది. "వాడు బుద్ధిమంతుడురా" అనేదానికన్న "వాడు ప్రజ్ఞాశాలి" అంటే కొంత ఘనంగా ఉండి వ్యత్యాసాన్ని తెలియజేస్తుంది.

ఈ విధంగా చూస్తే ఎరుకలో అయిదు విధాలున్నట్లు ప్రాచీనులే గ్రహించి, వాటి ప్రత్యేక లక్షణాలను చెప్పారు.

"స్మృతి ర్వ్యతీత విషయా
మతి రాగామి గోచరా,
బుద్ధి స్తాత్కాలికీ జ్ఞేయా
ప్రజ్ఞా త్రైకాలికీ మతా,
ప్రజ్ఞా నవనవోన్మేష
శాలినీ ప్రతిభా మతా."

ఆ యెరుక స్మృతి, మతి, బుద్ధి, ప్రజ్ఞ, ప్రతిభ అని అయిదు విధాలు. జరిగిపోయిన విషయాలను గురించిన జ్ఞానం స్మృతి. అంటే జరిగిపోయిన వాటిని తలపుకు తెచ్చుకోగలిగిన జ్ఞానమన్నమాట! ఇది ముందు జరగబోయే విషయాలను గురించి తెలుసుకోలేదు. ముందు జరగబోయే వాటిని గురించిన జ్ఞానం మతి. వెనుకటిదానికంటె ఇది శ్రేష్ఠమైనదన్న మాట. బుద్ధి అనేది వర్తమానమైన విషయాలను తెలుసుకునేది. ఇలా ఈ మూడున్నూ భూత-భవిష్యత్-వర్తమాన కాలాల్లోని విషయాలను క్రమంగా తెలుసుకునేవన్న మాట! ప్రతిభ వీటన్నిటినీ మించినది. భూత భవిష్యద్వర్తమాన విషయాలను తెలుసుకోవడమే కాకుండా క్రొత్త క్రొత్త విషయాలను గ్రహించే శక్తికూడా దీనికి వున్నది. అపూర్వ వస్తు నిర్మాణ శక్తి కూడా ప్రతిభావంతులకే వుంటుంది. మహాకవులు, గొప్ప శాస్త్రజ్ఞులు, మహా రాజకీయవేత్తలు ప్రతిభావంతులు మాత్రమే అవుతూ ఉంటారు.

ప్రతిభ లేకపోయినా కొందరు గొప్ప శాస్త్రవేత్తలు అయితే కావచ్చు. గురుశుశ్రూషచేసి, సంతతాభ్యాస మూలంగాను అది సాధ్యపడవచ్చును. కాని ఉత్తమ కావ్య నిర్మాణం ప్రతిభావంతునకే కాని సాధ్యం కాదు. ఈ విషయాన్ని కావ్యతత్త్వవేత్తలు నిర్ణయించారు. ప్రతిభలేని వారి రచనలు ప్రజాదరాన్ని పొందలేవు. అవి స్థిరంగా ఉండవు.

ఈ కాలంలో మహా ప్రతిభాశాలులు శాస్త్ర పరిశోధనల మూలంగా అపూర్వ విషయాలను కనిపెట్టి, దానిని ప్రజోపయోగానికీ దేశాభివృద్ధికీ ఉపయోగిస్తూ ఉండడం మనం చూస్తున్నాం. ప్రజ్ఞ ఉన్నవారు నిరంతర కృషిచేసిన యెడల ప్రతిభాశాలులు కాగలరు.

**మ**ర్నాడు క్లినిక్ తెరచి కొంచెం డల్‌గా కూర్చున్నాడు.

క్లినిక్ తెరచి నాలుగు రోజులు కూడా కాలేదు. అప్పుడే మనస్తే చేసినట్టుంది. ప్రొద్దున్న లేస్తే పరిగెత్తే విధానంలో క్లినిక్‌కి రావడం. మధ్యాహ్నం దాకా కూర్చోడం. నాలుగు దాకా విమలతో గడపడం క్లినిక్‌లో కూర్చోడం తొమ్మిది దాకా. తొమ్మిది దాటిందంటే క్లినిక్ కట్టేసి మెల్లగా యింటికెళ్ళేటప్పటికి తొమ్మిది కావడం. మానసికపు అలుపుతో నిదుర పోవడం.

తన స్నేహితుల్ని కలిసే తీరుబడి లేదు. పోనీ దానికి తగిన ఆదాయము ఉందా? అంటే అదీ లేదు.

అసలు ప్రయివేట్ ప్రాక్టీసు అంటే యిలా వుండనే కూడదు. ఇతర ఆఫీసులా యిదీ పదినించి అయిదు దాకానే ఉండాలి. నాలుగు రోజులకే తనకు యీ ఆలోచన వస్తే సంవత్సరాల తరబడి ప్రాక్టీసు చేస్తున్న వాళ్ళకెందుకు రాకుండా ఉంటుంది-యిలాంటి ఆలోచనలా? వాళ్ళకీ వొచ్చే ఉంటుంది. అయితే ఎందుకు డిస్పెన్సరీ సమయాల్ని మార్చరు? దీనికి వొకే కారణం అయి ఉండొచ్చు. అసలు ప్రయివేట్ ప్రాక్టీషనర్సులో యూనిటీ అంటూ ఉండదు. వొక డాక్టరు మరొక డాక్టర్ని విమర్శిస్తూ- యెదుటి డాక్టరు గురించి చెడ్డగా మాట్లాడుతూ- వచ్చిన పేషంటు తన దగ్గరికి రావడంవల్లే బ్రతికిందనీ- లేకపోతే చచ్చిపోయేదనీ- అభిప్రాయం యిచ్చి తమ ప్రాక్టీసు పెంపొందించుకోవాలని చూస్తూంటారు.

ప్రాక్టీసు పెంపొందించడం అంటే తనకు డాక్టర్ సురేష్ జ్ఞాపకం వచ్చేడు. అతను మెడికల్ కాలేజీలో యెప్పుడు చేరాడో యెవరికీ తెలియదు. ప్రతీ పరీక్షలో చూసిన ఆ ముఖాన్నే చూసీ చూసీ పరీక్షాధికార్లకు విసుగొచ్చి అతనికి డిగ్రీ యిచ్చి మెడికల్ కాలేజీ నించి బయటికి పంపించేసేరు.

అతను తనకు తెలిసినవాళ్ళకంతా తను డాక్టరనే పదేళ్ళనించీ చెప్పుకొనేవాడు. అతని తండ్రి సంపాయించిన యిళ్ళమీద వొచ్చే అద్దెలతో- అతను యింకో యిరవై ఏళ్ళయినా చాలా సులభంగా చదివిగలడు. అతని చుట్టుప్రక్కలంతా డాక్టర్లే! కనీసం

సీరియల్

# ప్రాక్టీసు పెట్టేడు



శ్రీరంగం

*(గత సంచిక తరువాయి)*

పదిహేను డిస్పెన్సరీలయినా ఉన్నాయి.

సురేష్ తను డిగ్రీ పుచ్చుకోగానే ఇంటి ముందర గదిలో డిస్పెన్సరీ తెరిచేడు. అతను తెరిచేముందు అతని శ్రేయోభిలాషులు కొందరు 'సురేష్ నువ్వు యింత హెవీ కాంపిటిషను ఉన్న వీధిలో తెరిచేకంటే, ఊరికి కొంచెం దూరంలో డాక్టర్లు తక్కువగా ఉన్న ప్రదేశంలో తెరిస్తే బాగుంటుందేమో!' అన్నారు.

అతను మాత్రం 'నేను ప్రాక్టీసు యిక్కడే పెడ్తాను. ఎలా పేషంట్లు రారో చూస్తాను?' అన్నాడు. అతని కసి అంతా ఆ చుట్టు ప్రక్కల ఉన్న డాక్టర్ల మీదే ఉంది. అందరూ అతన్ని గేలిచేసేవారు 'ఏంటి సురేష్. ఎన్నేళ్ళు నువ్వు యీ చదువు చదువుతావు' అంటూ ఆ డాక్టర్ల మనస్సులో తనో అప్రయోజకుడు అన్న ముద్ర పడిపోయింది. 'నేను అప్రయోజకుణ్ణి కాదు అని వాళ్ళ కళ్ళముందర ఉండే వాళ్ళకు చెప్పాలి' అన్న భావం అతన్ని అణువణువునా దహించి వేస్తూంది. అందుకే తను హవుస్ సర్జనుగా చేరిన మొదటరోజే డిస్పెన్సరీ తెరచేడు. మూడు వేల రూపాయల మందులు కొని డిస్పెన్సరీ నింపేసేడు. పాత చిన్నకారు కొత్తగా పెయింట్ చేయించి డిస్పెన్సరీ ముందు నిలబెట్టేసేడు. డిస్పెన్సరీ తెరవడానికి వొక రోజు ముందే ఫోను తెప్పించేడు. ఇన్ని ఆట్టహాసాల్తో డిస్పెన్సరీ తెరిస్తూ 'నాకు ప్రాక్టీసు వచ్చినా రాకపోయినా వేరేసంగతి— మొదట వాళ్ళ ప్రాక్టీసు డౌను చేయాలి— అది నా ప్రాథమిక ఉద్దేశం'— అనుకుంటూ మొదటిరోజు క్లినిక్‌లో కాలు పెట్టేడు.

ఖరీదైన మందులూ— మంచి మందులూ— డబ్బు తీసుకోకుండా ఇవ్వడం మొదలు పెట్టేడు. 'డాక్టర్ సురేష్ వైద్యానికి డబ్బు తీసుకోడం లేదు' అన్న మాట యింటింట బయలు దేరింది. జనం తండోపతండాలుగా రావడం మొదలు పెట్టేరు. ప్రొద్దున్న ఆరునించి తొమ్మిది దాకా తర్వాత ఆసుపత్రిలో హవుస్ సర్జరీ తిరిగి సాయంత్రం నాలుగునించీ రాత్రి పదకొండు దాకా, ఊపిరి తీసుకోడానికి కూడా సమయమే లేకపోయేది.

డబ్బు తీసుకోకుండా మందు యిస్తే యింత జనం వొస్తారనీ తను అనుకోలేదు. 'అంటే ప్రజలకు మందుతీసుకుని డాక్టర్లకు డబ్బు యివ్వడం యిష్టం లేదన్నమాట' అలా అనుకొనేవాడు. సాయంత్రం ఆరు గంటల సమయంలో క్లినిక్‌లో యాభై మంది క్యూలో ఉన్న సమయంలో విజిట్

***జరిగినకథ 4:*** కొత్తగా డిగ్రీ పుచ్చుకున్న డాక్టర్ సుదర్శనం డిస్పెన్సరీ పెడ్తాడు. కాలనీలో తమ కుటుంబానికి ఇరుగు పొరుగుగా వున్న శివయ్య, వెంకట్రామయ్యల తగాదాకు పరిష్కారం సూచిస్తాడు. ఎంతోమంది డాక్టర్లకు చూపించుకొని, కొన్ని వేల రూపాయలు డబ్బు ఖర్చు పెట్టినా తగ్గని వీరేశం జబ్బుకు డాక్టర్ సుదర్శనం తగ్గే మార్గం చెబుతాడు. ఫీజు క్రింద వీరేశం ఇచ్చిన అయిదు రూపాయలను 'తీసుకొని 'తన మొదటి సంపాదన'అని ఆనందిస్తాడు సుదర్శనం. తన దగ్గరకొచ్చే పేషెంట్స్‌తో అనేక సమస్యలను విదుల్కొంటూంటాడు డాక్టర్ సుదర్శనం.

ఉందని కారు తీసుకొని అలా అందరి డిస్పెన్సరీల ముందునించి వెళ్ళేవాడు. చాలా భాగం ఖాళీగా ఉన్న క్లినిక్కులను చూస్తూ ఏదో రకమైన తృప్తి అనుభవించేవాడు.

రెండు నెలలు యిలా గడిచేటప్పటికి మూడో నెల్లో ప్రక్కనుండే డాక్టరు సుబ్రావు వొక రాత్రి అతని దగ్గరికి వొచ్చి 'డాక్టర్ అటు మీరు తినటంలేదు — యిటు నేనూ తినటంలేదు- యీ ధర్మ ప్రాక్టీసులో. యిక దీన్ని ఆపేయండి!' అంటూ బ్రతిమాలేడు.

తనలో కసి కొంచెం కొంచెం తగ్గుతూంది. మనస్సులో 'వీళ్ళంతా దారికొస్తున్నారు. సురేష్ అంటే ఏంటో యిప్పటికయినా తెలుసుకుంటున్నారు' అని అనుకుని అలాగేనండీ - అని అందరితో అంటూ వొక సంవత్సరం దాకా పొడిగించేడు.

సరిగ్గా సంవత్సరానికి వొక యిరవై వేలు ధర్మానికి ఖర్చైపోగా — ఫ్రీ డిస్పెన్సరీ ఎత్తి కట్టేసి డబ్బు తీసుకోబడును అన్న బోర్డు ఎక్కించేసేడు.

డబ్బు ఎప్పుడయితే తీసుకోవడం మొదలు పెట్టేడో ఆరోజునించీ సరిగ్గా వొక్క వారం రోజులు డిస్పెన్సరీలో వొక్కరు కూడా లేరు. తర్వాత జనం మెల్లగా

## ప్రాక్టీసు పెట్టిచూడు

రాసాగేరు. ఇప్పుడు అతనికి మంచి ప్రాక్టీసు ఉంది.

తాము హవుస్ సర్జను. కాంటీన్లో యీ విషయాల గురించే ఎక్కువగా మాట్లాడుకొనేవారు. గతం గుర్తు తెచ్చుకుంటూంటే వాటి ప్రాధాన్యత యిప్పుడు తెలుస్తోంది.




ప్రతి ప్రాక్టీషనరూ మొదట్లో కాళ్ళూ చేతులూ ఎలా తన్నుకుంటారో!

వొక్కొసారి యీ ప్రయివేట్ ప్రాక్టీసు కత్తిమీద సాములా ఉంటుంది. విశ్వనాథ్ తనకంటే వొకేవొక సంవత్సరం సీనియర్. తను ఫైనల్ యియర్లో ఉన్నప్పుడు అతను హవుసర్జరీ చేసేవాడు. మనిషి మహా నెమ్మదస్తుడూ, చాలా మంచివాడు కూడా. కాంటీన్లో అప్పుడప్పుడు తనకు కనిపిస్తూండేవాడు. అతను ఊరికి రెండు మైళ్ళ దూరంలో డిస్పెన్సరీ తెరిచేడు. ఆ చుట్టు ప్రక్కల మంచి డాక్టరనీ దయార్ద్రహృదయుడనీ పేరొస్తోంది. వొకరోజు సాయంత్రం వొక ఆరు నెలల పాపని ఎవరో తీసుకొనివచ్చేరు. విశ్వనాథ్ చూసి ఇంజక్షను ఇచ్చేడు. రాత్రి తొమ్మిదింటికి డిస్పెన్సరీ కట్టేయబోతూంటే తిరిగి అదే పిల్లని తెచ్చేరు. విశ్వనాథ్ పరీక్షించి అపస్మారంలో ఉన్న ఆ పాపను మెదడు వాపు జ్వరం అని నిర్ధారించి ఆసుపత్రికి తీసుకెళ్ళి ఎడ్మిట్ చేసేడు. ఆరోజు రాత్రంతా ఆ పాప దగ్గరే ఉండిపోయేడు. ప్రొద్దున్నకల్లా పాప పరిస్థితి మెరుగుకాలేదు. యింకా క్షీణించిపోయింది. పన్నెండు గంటలకు ఫిట్సుతో చచ్చిపోయింది. ఆ పిల్ల తాలూకు వాళ్ళు 'మా దురదృష్టం—మీరు ఎంత ప్రయత్నం చేసినా మా పాప మాకు దక్కలేదు —' అంటూ తమ దుఃఖాన్ని వెళ్ళబోసుకున్నారు విశ్వనాథ్ ముందు.

సాయంత్రం అయిదు గంటలకే విశ్వనాథ్ యింటినించి బయలుదేరబోతూంటే— అతను డిస్పెన్సరీ పెట్టిన యింటి యజమాని ఆటోలో వచ్చి 'మీరు డిస్పెన్సరీకి రాకండి. ఎవరో చిన్న పిల్ల మీ పొరపాటు వల్ల మరణించిందట. వాళ్ళ తాలూకు వాళ్ళో మరెవరో వచ్చి డిస్పెన్సరీ ధ్వంసం చేసి వెళ్ళిపోయేరు. పాడు కాకుండా మిగిలిన మీ సామాన్లని నేను తీసి జాగ్రత్త పరచి మీకు పంపిస్తాను' అన్నాడట.

తను కాంటీన్లో కనపడ్డప్పుడు బాధపడుతూ చెప్పేడు విశ్వనాథ్.

హవుస్ సర్జరీ పూర్తి కాగానే విశ్వనాథ్ ఫారిన్ వెళ్ళిపోయేడు.

ఆ రోజు తనకు అనిపించింది, వీళ్ళు హవుస్ సర్జరీ పూర్తి కానీయకుండానే డబ్బు సంపాయించాలనీ డిస్పెన్సరీ తెరుస్తారు— ఎంత ఆశో? అని. కాని యీ రోజు ప్రతీ డాక్టరు వెనక ఉండే ఆర్థిక యిబ్బంది తనకు తెలుస్తూంది. యీ సమస్యలే వీళ్ళని ప్రోత్సహిస్తాయని అర్థం అవుతూంది.

'డాక్టర్ ఏంటి దీర్ఘంగా ఆలోచిస్తున్నారూ!' అంటూ లలిత ప్రవేశించింది. ఆమెతోబాటు యింటిమేట్ సెంటువాసన.

తలఎత్తి చూసేడు. చాలా శ్రద్ధతో ప్రత్యేకంగా తయారయి వొచ్చింది.

'ఎట్లా ఉన్నావేంటి?' అంటూ అడిగేడు.

'ఏంటో డాక్టరుగారూ! మీరు మాటిమాటికీ రావాలని మంచి మందు యివ్వకుండా వున్నారు' అంది.

తనేం మాట్లాడలేదు.

**మీరు అందమయిన**
**దుస్తులు ధరిస్తే చాలా?**
**మీ ముఖ సౌందర్యాన్ని**
**పెంపొందించుకోవాలి!**

మీ ముఖం అందంగా
ఉండడానికి... పాండ్స్ ఫేస్ పౌడర్
మృదుత్వమే కారణం.
అది మీ ముఖానికి మృదుత్వంతో
అసమానమయిన కళని తీసుకు
వస్తుంది. ఆ కళ అలాగే
ఉంటుంది, గంటల తరబడి...
గంటల తరబడి...




**పాండ్స్ ఫేస్ పౌడర్**
**అనుపమ ముఖసౌందర్యానికి అద్వితీయమ**

Pond's

CP-1482

'చెప్పండి!' అంది ఆమె.

తను ఏం మాట్లాడక పోవడం చూసి 'డాక్టర్ మీరు ఏ ఏ పేర్లు మాలు చూపేరు?' అంది.

'ఏం చూడ లేదమ్మా!' అని 'ఏ గుండెనొప్పి ఎలా వుంది?' అన్నాడు.

'అలానే ఉంది. మీరు యిచ్చినమాత్రలు ఏమీ పనిచెయ్యలేదు' అంటూ నసిగింది.

'లోపలికి పద' అంటూ కర్టెను లోనికి తీసికెళ్ళి స్టెతస్కోప్‌తో పరీక్షించి తిరిగి వచ్చి 'యివాళ మాత్రలు మారుస్తాను' అని మార్చి యిచ్చేడు. మాత్రలు అందుకున్నా యింకా అలానే కూర్చుంది టేబిల్ క్లాత్ సవరిస్తూ లలిత.

సరిగ్గా ఆ సమయానికి దేవుడిలా నరహరి వచ్చేడు. అతన్ని చూస్తూనే లలిత 'సెలవు తీసుకుంటానండీ' అంటూ వెళిపోయింది.

ఆమె కూర్చున్న కుర్చీలో కూర్చుంటూ 'డాక్టర్ యిది విన్నావా!!!' అంటూ 'ఛీ! ఛీ! వయస్సు వొస్తే సరా, బుద్ధి జ్ఞానం ఉండక్కర్లా, చిన్నవాడా చితక వాడా! యాభై ఏళ్ళవాడు! కొడుకులూ, కూతుళ్ళ పెళ్ళిళ్ళు చేసేసేడు. వాళ్ళకు పిల్లలు కూడా! ఇంకా కుర్రతనపు బుద్ధులు పోనివ్వకపోతే ఎలా ?' అన్నాడు.

'ఎవరి గురించండీ ? మీరు మాట్లాడుతూంది.'

'ఎవరిగురించా, ఆ వీరేశ గురించే.'

'ఏం అయింది ?'

'ఇంకా ఏం కావాలి ? ఆయన భార్య కన్నీళ్ళతో నా భార్యతో చెప్పి నవ్వు వీలొ చెప్పమంది మనిషిని చూసేను కదా! సంసారం వొదిలి అరణ్యవాసం పోవలసిన వయస్సుకాదా ? ఇంకా భార్యతో - అదీ పట్టపగలు కోడళ్ళూ, మనవలూ తిరుగుతూన్న యింట్లో - భార్యతో సరసంచేస్తూ వొక్క నిముషం కూడా వొదలనంటాడట. ఈ కొత్త బుద్ధి ఏంటి ? అందరూ ఏం అనుకుంటారు ? అంటే భార్యను తంతాడట. ఆరు నెలల క్రింద దాకా ఎంత మంచిగా మర్యాదగా ఉండేవాడూ. ఇప్పుడు యిలా అయిపోయేడంటే ?'

'ఏదయినా గాలి చేష్ట అంటావా ?'

'గాలిచేష్టా కాదు, మరేంకాదు. దాన్ని ఎన్‌లార్జ్‌డ్ ప్రోస్టేట్ అంటారు. అది కొంచెం వయస్సు మళ్ళిం తరువాత వొచ్చే

# ప్రాక్టీసు పెట్టిచూడు

జబ్బు నేను కొన్ని మందులు రాసియిస్తాను. వాడమనండి. క్రమేపీ తగ్గిపోతుంది' అని మందులు రాసి యిచ్చేడు.

మందుల కాగితం అందుకుంటూ 'డాక్టరూ కొద్దిగా మలబద్ధకంగా ఉందోయ్ ఏదైనా మాత్ర ఉంటే యివ్వు.'

తనో మాత్రతీసి యిచ్చేడు..

ఇంతలో ఎవరో ముప్ఫై ఏళ్ళలోపు ఆవిడ తలవొంచుకుని జనసమర్దంలో మీద ఎవరూ పడకుండా వొదిగే నడకతో వచ్చి నేలనే చూస్తూ 'డాక్టరుగారూ! యింజక్షను చేయాలండీ' అంది.

'సరే' అంటూ ఆమె యిచ్చిన బాటిలు అందుకున్నాడు.

**నాడు – నేడు**

నాడు రాజులు
కిరీటాలు పెట్టుకు పాలించారు
ప్రజలకు కిరీటాలు పెడుతూ,
నేడు నాయకులు
టోపీలు పెట్టుకు పాలిస్తున్నారు
ప్రజలకు టోపీలు వేస్తూ.

– రావి రంగారావు.

నరహరి 'డాక్టర్ యిక నేను వెళతాను' అంటూ వెళిపోయేడు. ఆమె 'యింజక్షను తొందరగా తీసుకోవాలండీ' అంది.

'కర్టెను లోనికి వెళ్ళి పడుక్కోండి' అని మందు సిరంజిలో నింపి తనూ కర్టెను లోనికి పోగానే మొఖంగా బెంచీమీద పడుక్కుని ఆమె కనిపించింది. దగ్గరకు వొచ్చి 'అమ్మా నడుం బట్ట వొదులు చేయలేదు' అనగానే ఆమె 'బట్టమీదనించే చేసేయండి' అంది 'బట్ట మీదనించి చేయకూడదమ్మా సెప్టిక్ అవుతుంది' అంటే 'నేను బోలెడు యింజక్షన్లు చేయించుకున్నాను అలానే – పర్వాలేదు – మీరు చేసేయండి.'

'అలా చేయడానికి కాదమ్మా, పోనీ మీకు నడుంకి తీసుకోడానికి అభ్యంతరం అయితే చేతికి తీసుకోండి' అన్నాడు.

'చేతికి నొప్పి చేస్తుంది. నడుంకే తీసుకోవాలని మా డాక్టరు చెప్పేరు ఊఁ' అంది.

'మీరు ఎవరేనా లేడీ డాక్టరు దగ్గరకెళ్ళి తీసుకోండి' అంటూ మందు బాటిల్లో పోసి యిచ్చేసేడు.

'నువ్వు వచ్చి రౌడీలా ఉన్నావే! నడుం బట్ట వొదులు చేస్తే యింజక్షను చేసేవాడ్ని నడుంమీద చెయ్యివేసి నెదవ పనుల చేద్దామనా!' అనే చూపుతో బయటికి వెళ్ళిపోయింది.

వాచీ చూసుకున్నాడు. పన్నెండు అయింది. ఈ రోజు విరామం రావని చెప్పింది. ఆమెకూ విసుగొచ్చేసినట్టుంది - తనతో సమానంగా యీ నాలుగు గోడల మధ్యలో కూర్చో అంటే విసుగురాదూ ?

ఇక క్లినిక్ కట్టేద్దాం అనుకున్నాడు. ఇంతలో భార్యా భర్తలలాగున్నారు. ఆమెకు యిరవై యేళ్ళుండొచ్చు అతనికి ఇరవై అయిదు దాకా ఉండొచ్చు అతని చేతిలో వొక సంవత్సరం బాబు లోపలికి వస్తూనే 'నమస్కారం' అంటూ విష్‌చేసేడు తను కుర్చీ చూపించి 'బాధేంటి?' అన్నాడు.

అతను తల ప్రక్కకి తిప్పి 'ఏమయింది' అంటూ భార్యను అడిగేడు.

ఆమె సిగ్గుపడుతూ క్రిందకు చూడసాగింది. 'ఓహో! నెల తప్పితే ఆ మాట కొత్తవాడి ముందు చెప్పాలంటే యిలానే సిగ్గుపడతారు' అనుకుని 'ఏంటి బట్ట కాలేదా?' అన్నాడు తను.

అతను చప్పున 'ఆమెకు కాదండీ! ఈ పాపకు' అన్నాడు.

'పేషంటు పాపన్నమాట !' అనుకుని 'యీ పాప మీకు ఏం అవుతుంది?' అన్నాడు తను.

'నా కూతురు' అని అతను అనేటప్పటికి తనకు విచిత్రం అనిపించింది.

డాక్టరు దగ్గరికెళదాం అని ఈ మహామ భావునితో యీమె అంటే 'ఎందుకు?' అని అడగకుండానే యితను వచ్చేసేడు. ఇప్పుడు తనముందు అడిగితే ఆమె సిగ్గువిడిచి చెప్పటంలేదు. ఈ సిగ్గు యింత తొందరగా తీరేటట్టూ లేదు. అతనికేమో పాపకు ఏం బాధకూడా తెలియదు! అని అనుకుని వాళ్ళని ప్రశ్నించకుండానే వాళ్ళ పాపను పరీక్షచేసి యింజక్షనూ మందులూ యిచ్చి 'రేపు

(43వ పేజీ చూడండి)

# సినిమా విశేషాలు -జి. వి. జి.

## పసుపు పారాణి

దుర్గా నాగేశ్వరరావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో కొటికలపూడి గోవిందరావు, ఆకుల బుల్లిఅబ్బాయి నిర్మించే బి. బి. ఆర్ట్ పిక్చర్స్ ''పసుపు పారాణి'' వన్నెల చిత్రంలో మురళీమోహన్, సత్యనారాయణ, మాతన్‌ప్రసాద్, అల్లురామలింగయ్య, సుజాత, రమాప్రభ వగైరా నటవర్గం. దాసం గోపాలకృష్ణ కథ, మాటలు రాశాడు. రమేష్‌నాయుడు సంగీతం, జి. కె. రాము ఛాయ, అంకిరెడ్డి కూర్పు, భాస్కరరాజు శిల్పం నిర్వహిస్తున్నారు. ''ఈ చిత్రం పూర్తిగా మన రాష్ట్రంలోనే తయారవుతుంది,'' అన్నారు నిర్మాణ బాధ్యతలు వహించే కొటికలపూడి కాశి.

## ''పులిగోవిందు'' – నటవర్గం

ప్రదీప్ ఇంటర్నేషనల్‌వారి పై వన్నెల చిత్రానికి నవంబర్ 22న తారీ గీతం ధ్వనిముద్రిక చేయబడింది. మురళీమోహన్, సత్యనారాయణ, మోహన్‌బాబు, ప్రభాకరరెడ్డి, కాంతారావు, గిరిబాబు, రాజ్‌బాబు, కె. వి. చలం, పెమ్మసాని రామకృష్ణ, ఎస్. వి. రామదాసు, కె. కె. శర్మ, అమ్జాద్‌కుమార్, జోకర్‌తులసి, నాగేష్, దీప, గీత, జయమాలిని పాత్రధారులని వివరించారు కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే ఎ. ఎస్. మూర్తి. గొల్లపూడి సంభాషణలకర్త, సి. నారాయణరెడ్డి గీతాలకు సత్యం బాణీలు కూర్చారు. బాలు సంకలనకర్త.



'దేవుడు మామయ్య'లో బేబీ గౌరి



'బుచ్చిబాబు'లో జయప్రద, అక్కినేని

## 'బుచ్చిబాబు''

దాసరి కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వం వహించే మరో వన్నెల చిత్రం అక్కినేని సమర్పణలో వెంకట్ అక్కినేని, నాగార్జున అక్కినేని నిర్మించే ''బుచ్చిబాబు''. డిసెంబర్ 1 నుంచి 20 వరకూ అన్నపూర్ణ స్టూడియోలో జరిగే షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తవుతుందని తెలియజేశారు నిర్మాతలు. ఎ. ఎన్. ఆర్. సమర్పణలో ఆయనతోపాటు జయప్రద, గుమ్మడి, ప్రభాకర రెడ్డి, నూతన్‌ప్రసాద్, రమాప్రభ ప్రధాన భూమికలు నిర్వహిస్తున్నారు. చక్రవర్తి స్వరలహరిలో పాటలన్నీ దాసరి రాయడం మరో విశేషం. మూడు పాటలు కేరళలో చిత్రీకరింపబడ్డాయి. సెల్వరాజ్ ఛాయ, భాస్కరరాజు శిల్పం, బాలు కూర్పు, జి. పి. ఎస్. శాస్త్రి సహకార దర్శకత్వం, బోసుబాబు నిర్మాణ సారథ్యం తెరవెనుక హంగులు. జనవరిలో ప్రారంభమయ్యే అన్నపూర్ణ స్టూడియోస్ కొత్త వన్నెల చిత్రంలో ఎ.ఎన్.ఆర్. సరసన జయసుధ నాయిక. జంధ్యాల సంభాషణల కర్త. సింగీతం శ్రీనివాసరావు దర్శకుడు.

## ఛాలెంజ్ రాముడు కోసం ఇద్దరు యువతుల ఛాలెంజ్

ప్రేమ (గీత)తో విజయ్ (ఎన్. టి. ఆర్.) రెస్టారెంట్‌లోకి ప్రవేశించి ఓ టేబుల్ ముందు కూర్చోగానే ''ఆ పెయింటింగ్ ఎక్కడుంది ?'' అడిగాడు.

''పెయింటింగ్ గురించే తప్ప ప్రేమతో ప్రేమగా మాట్లాడకూడదా, విజయ్ ?''

ఇంతలో కొద్ది దూరంలో కూర్చొనున్న అరుణ (జయప్రద) వడివడిగా వచ్చేసరికి విజయ్ ఇరుకునపడ్డాడు.

''ఎవతివే నువ్వు ?'' అని అరుణ అడిగితే, ''నువ్వెవతివే ?'' అని తిరుగుప్రశ్న వేసింది ప్రేమ.

''విజయ్ నావాడు.''

''కాదు; నావాడు.''

అరుణకు కోపం మరింత రెచ్చిపోయింది. విజయ్‌తో ''నన్ను వెర్రిదాన్నిచేసి, కారాగిపోయిందని అబద్ధం చెప్పి, రోడ్‌మీద వదిలేసి, ఇలా పారిపోయి వస్తావా ? వచ్చింది ఈ చుంచుమొహందాని కోసమేనా ?'' అంది.

''నేను చుంచుమొహందాన్నా ? నువ్వు ఉడత మొహందానివి కదూ ?'' అని అడిగేసింది ప్రేమ.

''మీ మగాళ్ళ బుద్ధే అంత. కొత్త వింత పాత రోత అని—పెళ్ళి చేసుకోబోతున్న నన్నొదిలేసి దీంతో మీ తిరుగుళ్ళేమిటసలు ?'' అని అరుణ అడిగితే, తెల్లమొహం వేసిన విజయ్ ''షటప్ ! నేనేం నిన్ను పెళ్ళి చేసుకుంటానని మాటిచ్చానా ? ప్రేమను ప్రేమించాను. పెళ్ళి చేసుకోబోతున్నాను. డబ్బాల్ !'' అన్నాడు.

అరుణ అక్కడ ఇంకో క్షణం ఉండలేక రుసరుసలాడుకుంటూ వెళ్ళిపోయింది.

ప్రేమ గోముగా ''థాంక్యూ, విజయ్ ! నా మనసులోని మాట మీరే బయట పెట్టేశారు. నేనే మన పెళ్ళి టాపిక్ ఎత్తుదామనుకున్నాను. మీరే అనేశారు !'' అంది.

''నేను—అన్నానా ? అవును. అన్నానుకదూ ? అన్నాను. ఏస్ !'' అన్నాడు విజయ్ తడబడుతూ.

''మిమ్మల్నోసారి మా ఇంటికి తీసుకెళ్ళి డాడీకి చూపిస్తాను. మా డాడీ చాలా సంస్కారం ఉన్న మనిషి. నేను మీ సంగతి చెప్తే, ఏమాత్రం కాదనవంతటి మంచి మనిషి ఆయన,'' అంది ప్రేమ ఆనందంతో.

విజయ్‌కు నవ్వాలో, ఏడవాలో తోచలేదు.

టి. ఎల్. వి. ప్రసాద్ దర్శకత్వంలో తాతినేని ప్రకాశరావు నిర్మించిన అనిల్ ప్రొడక్షన్స్ ''ఛాలెంజ్ రాముడు'' వన్నెల చిత్రంలో సత్యనారాయణ, గుమ్మడి, నూతన్‌ప్రసాద్, రావుగోపాలరావు, మిక్కిలినేని, హరిబాబు, పుష్పలత, సత్యకళ, గెస్టుగా కాంతారావు, టి. రాజేశ్వరి, రాఘవయ్య పాల్గొన్నారు. మహేంద్రన్ కథకు జంధ్యాల మాటలు; చక్రవర్తి సంగీతానికి ఆత్రేయ, వేటూరి గీతాలు రాశారు. దేవరాజ్ ఛాయ, తోట శిల్పం, కన్నన్ కూర్పు, ఐ. కృష్ణమూర్తి ప్రొడక్షన్ నిర్వహించారు. [22వ పేజీ చూడండి]

( గత సంచిక తరువాయి )































[ఇంకా ఉంది]

'మూగకు మాటొస్తే'లో ఒక దృశ్యం

# సినిమా

## "ఓ ఇంటి భాగోతం"

డాక్టర్ తాళ్ళూరి కృష్ణకుమారి, ఎం. బి. బి. యస్‌తోపాటు నవతా ప్రసాద్‌ను పరిచయంచేసే నవతా ఆర్ట్స్ "ఓ ఇంటి భాగోతం" వన్నెల చిత్రానికి నవంబర్ 19న తొలి పాట రికార్డ్ చేయబడింది. "20-21న తేదీల్లో మరో నాలుగు పాటలు రికార్డ్ చేస్తాం," అన్నారు నిర్మాత ఎన్. కృష్ణంరాజు. "చంద్రమోహన్, మాధవ్‌ప్రసాద్, ప్రసాద్‌బాబు, వంకాయల, పి. ఎల్. నారాయణ, రాళ్ళపల్లి, దీప, రమాప్రభ, రాజేశ్వరి, సుజాత పాత్రధారులు," అన్నారు డైరెక్టర్ దేవదాస్ కనకాల. ఎమ్వియల్ మాటలు, జి. కె. వెంకటేశ్ స్వరకల్పనలో ఆరుద్ర, కోపెల్ల శివరాం గీతాలు రాశారు. తార ఛాయ, కళాధర్ శిల్పం, నాను కూర్పు, శివ—సుబ్రహ్మణ్యం నృత్యాలు — తెరవెనుక హంగులు

## గురు నాలుగో షెడ్యూల్ పూర్తి

"డిసెంబర్‌లో పూనేలో హెలికాప్టర్ ఫైట్స్ తీస్తున్నాం. అదే నెలలోనే కొడైకెనాల్‌లో కొన్ని పాటల చిత్రీకరణతో మా చిత్రం పూర్తవుతుంది," అన్నారు "గురు" వన్నెల చిత్రాన్ని ఐ. వి. శశి దర్శకత్వంలో నిర్మించే ఆర్. సి. ప్రకాష్. కమలహాసన్, శ్రీదేవి, సత్యనారాయణ, మోహన్‌బాబు, ప్రభాకరరెడ్డి, శిల ముఖ్య నటవర్గం. జంధ్యాల మాటలు, ఆత్రేయ గీతాలు రాశారు. ఇళయరాజా సంగీతం, జైవిన్ విన్సెంట్ ఛాయ నిర్వహిస్తున్నారు. నవయుగ ద్వారా జనవరి 1న విడుదలవుతుందని చెప్పారు ఈ చిత్రానికి నెగిటివ్ హక్కుదారులు సుజాతా వెంకటేశ్వరన్. ★



'బందిష్' (చిలిపి కృష్ణుడు)లో రాజేష్‌ఖన్నా, హేమమాలిని, నిర్మాత రామానాయుడు.
[ప్రారంభోత్సవంలో]



# Parryware is among the finest sanitaryware in the world. The best architects will agree with us.

AVAILABLE IN
GLEAMING WHITE AND
IN SIX GENTLE
PASTEL SHADES.

E.I.D.- Parry (India) Limited
Ceramics Division
Dare House
MADRAS 600 001

EID 2399

# సినిమా

## సమాజానికి సవాల్‌లో రంగారావు వేడుకోలు

రాజశేఖరం (రావుగోపాలరావు), మరికొందరు పెద్దలు హాల్లో కూర్చొని పగలబడి నవ్వుకుంటున్నారు. ఇంతలో రంగారావు (సత్యనారాయణ) ప్రవేశించేసరికి అందరూ నవ్వడమాపి, అతనివంక కోపంతో చూస్తూండిపోయారు.

''నమస్కారమండి,'' అన్నాడు రంగారావు వినమ్రంగా.

''ఎందుకొచ్చావిక్కడికి?'' అడిగాడు రాజశేఖరం.

''రాజశేఖరంగారూ! గజదొంగ రంగన్న ఏనాడో చచ్చిపోయాడు. ఇది నాకు పునర్జన్మ. మీ అమ్మాయికి మనసిచ్చిన ఓ యువకుని తండ్రిగా నాబిడ్డకి సంతోషాన్ని భిక్షపెట్టమని అర్థించడానికొచ్చాను.''

''అడుక్కోడానికొస్తే, ఇంకో గుమ్మం చూసుకో! వెళ్ళు!''

''కొన్నాళ్ళు దుర్మార్గపు బాటలో నడిచింది నేను. కావాలంటే నన్ను కొట్టండి. చంపండి. కాని, నా పాపం నా బిడ్డ బతుక్కి శాపం కాకూడదు. నా తప్పులకు నా కొడుకుని, మీ కూతుర్ని శిక్షించకండి.''

''నా కూతురి గురించి మాట్లాడావంటే నాలుక తెగ్గోస్తాను జాగ్రత్త!''

'కాళ రాత్రి'లో చంద్రలేఖ



''నారికేళాదు, బాబూ! తల తెగ్గొట్టండి. కాని, అమాయకుల మధ్య పెరిగిన అనురాగాన్ని మాత్రం తెగ్గొట్టకండి. అదే నా ప్రార్థన.''

''నోర్ముయ్! ఏం చేయాలో నువ్వు నాకు చెప్పక్కర్లేదు. ఆరునూరైనా నా కూతురు గజదొంగల కొంపకి కోడలు కావడానికి వీల్లేదు. ఫో అవతలికి!''

రంగన్న కోపాన్ని అణచుకుంటూ, ''రాజశేఖరంగారూ! నా గతాన్ని ఎత్తి చూపించి నన్ను వెలివేస్తున్నారు. నేను వెనకటి రంగన్ననే అయి వుంటే, ఇన్ని మాటలక్కర్లేదు. 'ఫో!' అన్న ఒక్క అక్షరం వినిపిస్తే చాలు — అలా అన్న వాడి తల వెయ్యి ముక్కలై, గాలిలో ఎగురుతూండేది. కాని, నేను రంగన్నని కాదు — రంగారావుని ... పోతాను, బాబూ, వెళ్ళిపోతాను. కాని, ఒక్కమాట... ఒకప్పుడు నేను బందిపోటుగా ఆస్తులు మాత్రమే దోచుకునేవాడ్ని మీరిప్పుడు బందిపోటుగా వ్యవహరిస్తున్నారు. అమాయకుల జీవితాలను దోచుకుంటున్నారు. సెలవ్!'' అని గిరుక్కున తిరిగి వడివడిగా వెళ్ళిపోయాడు.

కృష్ణ, శ్రీదేవి నాయకా నాయికలుగా ఎస్. పి. రాజారాం దర్శకత్వంలో శ్రీ ఉదయ్ ఆర్ట్ పిక్చర్స్ వారి ''సమాజానికి సవాల్'' వన్నెల చిత్రాన్ని ఎస్. పి. వెంకన్నబాబు నిర్మించారు.

## దేవర్ ఫిలిమ్స్ 32 వ చిత్రం

''పొట్టేలు పున్నమ్మ—లో నటించిన పొట్టేలు రాము, రాముా గెలుపు నీదే—లో నటించిన శునకం రాము — మా కొత్త చిత్రంలో నటించడం విశేషం. కీలక పాత్రలో ఒక బిడ్డ కూడా వుంటుంది. ఊటీ — కొడైక్కానాల్‌లో తీసే పతాక సన్నివేశాలలో మృగాలన్నీ పాల్గొనడం ఆదనపు ఆకర్షణ,'' అన్నారు నిర్మాత సి. దండాయుధపాణి. దేవర్ ఫిలిమ్స్ కొత్త చిత్రానికి నవంబర్ 19 వ తేదీ ఉదయం ఆరు గంటలకు ఆ సంస్థ కార్యాలయంలోనే ప్రారంభోత్సవం జరిగింది. రజనీకాంత్, రతి నాయకా నాయికులు. సత్యనారాయణ, మోహన్ బాబు, అల్లురామలింగయ్య, రమాప్రభ యితర ముఖ్య పాత్రలు ధరిస్తున్నారు. ఆత్రేయ మాటలు — పాటలు, ఇళయరాజా సంగీతం, రామ్మూర్తి ఛాయ, బాలు కూర్పు తెర వెనుక వెంగులు. ''మే మాసంలో విడుదల చేయడానికి నిర్ణయించాం,'' అన్నారు ఈ చిత్ర దర్శకుడు ఆర్. త్యాగరాజన్.

## కొత్త దర్శకుడు ఎస్. పి. రాజారాం

కృష్ణ హీరోగా వెంకన్నబాబు నిర్మించిన ''సమాజానికి సవాల్'' చిత్రానికి ప్రతిభావంతంగా దర్శకత్వం నెఱపిన ఎస్. పి. రాజారాం స్వస్థలం గుంటూరు. హైదరాబాద్ న్యూ సైన్స్ కళాశాల నుండి బి.ఎస్.సి పట్టా పుచ్చుకున్నారు. మద్రాసు ఫిలిమ్ ఇన్‌స్టిట్యూట్‌లో దర్శకత్వం, స్క్రీన్‌ప్లే శాఖల్లో డిప్లొమా పొందారు. అప్పుడు ''సాగా ఆఫ్ స్టోన్స్'' అనే డాకుమెంటరీని, ''ఆన్ ది



'సన్నాయి అప్పన్న'లో శోభన్‌బాబు

పేవ్‌మెంట్'' అనే పేద ప్రజల జీవితానికి అద్దం పట్టే హాస్య చిత్రాన్ని తీసి, బహుముఖ ప్రశంస లందుకున్నారు. ఆ తర్వాత ''మొరటోడు'' చిత్రానికి అసిస్టెంట్ డైరెక్టర్‌గా, ''సింహ గర్జన''కు అసోసియేట్ డైరెక్టర్‌గా మరింత అనుభవం గడించారు.

'కలియుగ రావణాసురుడు'లో శారద



# సైకత భూ సిరి సంపదలు!



టర్క్మెనియాలో [కారాకుమ్ ఎడారుల] ఇసుక లోపలనుంచి కాంక్రీటు భూగర్భ జల మార్గాలను నిర్మిస్తున్న దృశ్యం.

ప్రస్తుతం ప్రపంచంలో ఎడారుల విస్తీర్ణం 4 కోట్ల చదరపు కిలోమీటర్లు.

గత 50 సంవత్సరాలలో వాటి విస్తీర్ణం పది లక్షల చ. కి. మీటర్లు పెరిగింది. సహారా ఎడారి పోయిన పదేళ్లలో 600 కిలోమీటర్లు విస్తరించింది.

భూమిని సాగుకి తీసుకురాకుండా ఉంచడం, తీవ్ర వర్షాభావం, అతిగా సాగుచేసి భూమిని చవిటిపర్రగా చేయడంతోపాటు ఆధునిక సాంకేతిక విజ్ఞానం కూడా ఈ ఎడారుల విస్తరణకి కారణాలని శాస్త్రవేత్తల అభిప్రాయం.

ఈ విధంగా ఎడారులు పెరిగిపోతూ ఉంటే పరిస్థితి ఎలా ఉంటుందన్నది ఊహకి అందని విషయం. వాటిని సస్యశ్యామలం చేయడమే కాకుండా విస్తరణని అరికట్టడం కోసం కూడా సోవియట్ శాస్త్రవేత్తలు కృషి చేస్తున్నారు.

## సహజ సంపద

ఎడారుల్ని అదుపులోకి తెచ్చి వాటిలోని సహజ సంపద వెలికితీస్తే ప్రపంచ జనాభాకు అత్యధిక జీవన ప్రమాణాలు లభ్యమవుతాయి.

గత 20–25 ఏళ్లుగా సోవియట్ యూనియన్ ఎడారుల్ని సాగులోకి తేవడానికి, పారిశ్రామికాభివృద్ధికీ విస్తృత కార్యక్రమాల్ని అమలు జరుపుతూ ఉంది. మధ్యాసియా, కజక్‌స్తాన్‌లోని మరుభూముల్ని పచ్చికబీళ్లుగా మార్చడంవల్ల 5 కోట్ల గొర్రెలు, మేకలు, కోటిన్నర పశువులు, 30 లక్షల గుర్రాలు, మొత్తం ఒంటెల మందలకు సరిపోయే గ్రాసం లభిస్తున్నది. సాగులోకి తెచ్చిన ప్రతి పది లక్షల హెక్టార్ల ఎడారిలో 15 లక్షల టన్నుల ప్రత్తి, 5 లక్షల టన్నుల బియ్యం, 33 లక్షల టన్నుల మొక్కజొన్న, 77 లక్షల టన్నుల పాలు, 20 లక్షల టన్నుల మాంసం, వేలాది టన్నుల పళ్లు, కూరలు లభిస్తున్నాయి. దీనికి అయిన వ్యయం కేవలం మూడు నాలుగు సంవత్సరాలలో తిరిగి రాబట్టుకోవచ్చు.

## నూనె, ఖనిజ సంపద

ఎడారుల్లో నూనె, సహజ వాయువు, గంధకం, బ్రోమైన్, ఖనిజ లవణాలు, ఇతర ముడి ఖనిజాలు సమృద్ధిగా ఉంటాయి. సోవియట్ శాస్త్రజ్ఞుల కృషివల్ల ఇప్పటికే ఎడారుల్లో సహజ వాయు సరఫరా మార్గాలు, జల మార్గాలు ఏర్పడ్డాయి. కొత్త నగరాలు, ఒయాసిస్సులతోపాటు మానవ నిర్మిత జలనిధులు వెలిశాయి. ఇసుక గుట్టలమీద విద్యుత్ సరఫరా మార్గాలు నిర్మితమయ్యాయి

సూర్యరశ్మి, నీరు సర్వశక్తి సమన్వితం. అతిమందమైన ఇసుకపొరలకింద భారీ జల నిధులను భూగర్భ శాస్త్రవేత్తలు కనుగొన్న తర్వాత పశ్చిమ తుర్క్మెనిస్తాన్ ఎడారులు పారిశ్రామిక



ఇసుక దిబ్బల గమనాన్ని పరిశీలిస్తున్న శాస్త్రవేత్తలు.

# ములనుంచి



"కారాకుమ్" ఎడారులలో మారిపోతున్న తన పరిసర యిసుకసీమని వింతగా పరికిస్తున్న ఎడారి తొండ

మండలంగా అభివృద్ధి చెందాయి. చిన్న చిన్న కార్మికవాడలలోని ప్రజలకు సౌర జలఘటాల ద్వారా నీటిని సరఫరా చేయడానికి శాస్త్రవేత్తలు ప్రయత్నాలు చేస్తున్నారు.

ఎడారుల్ని సస్యశ్యామలం చేసే కార్యక్రమంలో భాగంగా నదులలో నీటిని పూర్తిగా అదుపుచేసి పచ్చికబీళ్లకు సరఫరాచేసే పథకాలు రూపొందించబడ్డాయి. సోవియట్ మధ్యాసియాలలోని ఎడారి భూముల్లో 70 లక్షల హెక్టార్లు సాగులోకి వచ్చాయి. మరో 40, 50 లక్షల హెక్టార్లు త్వరలో సాగులోకి వస్తుందని అంచనా. వీటివల్ల ఎడారి వాతావరణంలో మార్పులు వచ్చాయి. అయితే అదే సమయంలో కొంత భాగం బీరభూమిగా మారుతూ ఉంది. ఇలాంటి వైపరీత్యాల నిరోధానికికూడా శాస్త్రజ్ఞులు ఎడారుల్లో నిత్యం భూగర్భ పరిశోధనలు జరుపుతున్నారు.

నానాటికీ పెరిగిపోతున్న జనాభా సమస్య దృష్ట్యా అద్యతన భావిలో ఎడారుల్ని సస్యశ్యామలం చేయడానికి మానవుడు పూనుకోడం తప్పనిసరి అవుతుందనడంలో సందేహంలేదు.

— శ్రీకాంత్

## కాలమహిమ

తడవకు ఒకే చిత్రంలో నటించాలన్న నియమాన్ని లోగడ పాటిస్తూ వచ్చిన దిలీప్‌కుమార్ ఇప్పుడు "క్రాంతి, శక్తి" వగైరా ఏడెనిమిది చిత్రాల్లో ఒకేసారి నటిస్తున్నాడు.

మూడవదఫా కూడా శారదకు జాతీయ ఉత్తమ నటి గౌరవం దక్కినందుకు ఈర్ష్యపడ్డ తోటి తారలు లేకపోలేదు. కాని హాలివుడ్ నటి కేథరిన్ హెప్‌బర్న్ మూడుసార్లు ఆస్కార్ అవార్డులు పొందినందుకు అక్కడి తారలు ఘనంగా సన్మానించారు.

గుడియాత్తంవద్ద ఆమధ్య ఎస్. వి. ఆర్. ఎంటర్‌ప్రైసెస్‌వారి "ఒత్తయడి పాదయిలే" అనే తమిళ చిత్రం ఔట్‌డోర్ షూటింగ్ జరిగింది. ఆ విషయం తెలిసి గుడియాత్తంలోని ఓ హెడ్‌మాస్టర్ తన హైస్కూల్‌కు ఒక రోజు సెలవు ఇచ్చేశాడట. స్టూడెంట్స్‌నంతా తీసుకొని మేస్టర్లు ఆ షూటింగ్ చూడడానికి లొకేషన్‌కు వెళ్లారట.

రోజుకు దాదాపు ఏడెనిమిది పేకెట్లదాకా సిగరెట్లు తగలేట్టే అమితాబ్‌బచ్చన్ ఇటీవల హఠాత్తుగా ఆ అలవాటుకు స్వస్తి చెప్పేశాడట.

లోగడ ఆశాభోన్‌స్లే ఎవరైనా సిగరెట్ తాగుతూంటే పాడగల్గేది కాదట. వాళ్ళకు కనీసం 30 అడుగుల దూరంలో ఉండేదట. ఆర్. డి. బర్మన్ విపరీతంగా సిగరెట్లు కాలుస్తాడు. అంచేత, ఇప్పుడు రికార్డింగ్ థియేటర్‌లో ఎవరైనా సిగరెట్ పీలుస్తున్నా ఆమె నిరభ్యంతరంగా పాడేస్తుందట.

కొన్నేళ్ళ క్రితం ప్రముఖ రచయిత, దర్శక నిర్మాత కె. ఎ. అబ్బాస్ ఒక కొత్తరకం కథ రాసి, కొత్త తారలతో చిత్రంగా తీశాడు. దాన్ని విడుదల చేయడానికి బొంబాయిలో ఎక్కడా థియేటర్ దొరకలేదు. కొన్ని రోజుల తర్వాత ఒక ఎ. సి. థియేటర్ మాత్రం ఎక్కువ అద్దెకు దొరికింది. ఐతే, దాని యజమాని ఒక షరతు పెట్టాడు. "మీ చిత్రం నచ్చక ప్రేక్షకులు కోపావేశంలో మా హాలులోని కుర్చీలు విరగ్గొడితే...? అందుకని మీరు ముందుగా ఫర్నిచర్ డిపాజిట్టుకింద పదివేలు చెల్లించాలి," అనడంతో అబ్బాస్ ఒప్పుకోక తప్పిందికాదు. చివరికా చిత్రం అనూహ్యమైన విజయాన్ని సాధించింది. రాష్ట్రపతి బహుమతి కూడా పొందింది. ఆ చిత్రం "షెహర్ ఔర్ సప్న".

తిరుచ్చి కైలాసపురంలోని ఒక థియేటర్‌లో "త్రీ ఫాంటాస్టిక్ సూపర్‌మన్" అనే ఆంగ్ల చిత్రాన్ని ఉదయపు ఆటలుగా ప్రదర్శిస్తున్నారు. ఆ చిత్రానికి తమిళంలో "ముగ్గురు రజనీ(కాంత్) వీరులు" అని పోస్టర్లు వేశారు. అంతకుముందు ఇదే చిత్రానికి "గ్గురు ఎం. జి. ఆర్. వీరులు" అని పోస్టర్లు వేశారట. —జి.వి.జి.

పెడివాడో కొత్త జలాయిరాయుడు! రోజా వస్తే సీజన్ టిక్కెట్ బాపతుగాడు — అని

ఆఖరుకు — మూడోసారి ప్లాట్‌ఫాం సర్వేచేసి జులపాల యువకుడు సంధ్య పెట్టెలోనే ఎక్కి, సంధ్య ఎదురుగావున్న మగాళ్లను అన్నాడు, "కొద్దిగా జరగండి!" అని.

"అటుప్రక్క పెట్టె అంతా ఖాళీగావుంటే ఎందుకయ్యా ఇక్కడ ఇరుక్కొని కూచుంటావు?" అని సణుక్కున్నాడు ఒక ప్రయాణీకుడు

"ఏంటయ్యా నీ జబర్దస్తీ! జరుగు! ఐదుగురు కూర్చోవాల్సిన సీటులో నలుగురు కూర్చొని జరగమంటే ఏంటి నీ పేచీ?" అన్నాడు జులపాల కుర్రాడు.

ఆ ప్రయాణీకుడు మౌనంగా జరుగగా జులపాల కుర్రవాడు కూర్చున్నాడు కూర్చుని జేబులోంచి రంగురంగుల చేతిరుమాలును తీసి, చాలా విసుగ్గా ముఖం తుడుచుకుని జేబురుమాలు మళ్ళీ జేబులో పెట్టుకుని సంధ్య వంక చూశాడు

సంధ్య ఎటో చూస్తున్నట్లు కనిపించినా జులపాల కుర్రాడి వేషాలు గమనిస్తున్నది జులపాల కుర్రాడిలాంటి వాళ్లను సంధ్య చాలామందిని చూసింది ఇలాంటి కుర్రాళ్ళు రైలు ఆ చివర నుండి ఈ చివరిదాకా చూస్తారు — ప్రతి పెట్టెలోకి ఎక్కడ అందమైన అమ్మాయి కనిపిస్తే, ఆ పెట్టెలో ఎక్కుతారు — సీటు వున్నా లేకున్నా వీళ్ళు అందాల పోటీలో జడ్జెస్ లాంటి వారు వీరు ఎక్కిన పెట్టెలోవున్న అంత అందమైన స్త్రీ, ఇక ఆ రైలు మొత్తంలో వుండదు చాలామంది వూరికే అలా చూస్తుంటారు కొందరైతే తాను చదివే

# స్వయంవరం

మ్యాగజైన్ చదవమని ఆఫర్ చేస్తారు లేకుంటే ఆ పిల్ల చదువుతున్న మేగజైన్ అడుగుతారు

ఎక్కడో మాటికొకడూ కోటికొకడూ అసభ్యంగా ప్రవర్తిస్తారు

సంధ్య తనకు జరిగిన అనుభవాన్ని ఒకమారు నెమరువేసుకుని నవ్వుకున్నది

ఒకసారి విజయవాడ బండిలో మగాళ్ళ కంపార్ట్‌మెంటులో కూర్చున్నది సంధ్య ఆరోజు ఖర్మగాలి తను ఒక్కతే స్త్రీ వున్నదా పెట్టెలో ఎవరో కొత్త బాపతు — ఇద్దరు రౌడీలు తన ఎదురు సీట్లో కూర్చుని మెల్లమెల్లగా ప్రారంభించి ఆఖరుకు డైరెక్టుగా తనతో అసభ్యంగా మాట్లాడడం మొదలుపెట్టారు తను చాలాసేపు ఓర్చుకుంది ఆఖరుకు వేరుశనగకాయలు అమ్ముకునే కోటమ్మ అటుగా వెళ్తుంటే 'కోటమ్మా! వీళ్ళేంటో వాగుతున్నారు కనుక్కో' అన్నది తను అంతే! కోటమ్మ వాళ్ళ మీద తాటకిలాగా పడింది వాళ్ళు ఇదెక్కడి ప్రమాదంరా బాబూ అని బెదుర్తుంటే అరటిపండ్లు అమ్ముకునే అంకయ్య వాళ్ళను పట్టుకుని దులిపిపారేశాడు మంగళగిరి స్టేషన్ రావడంతో స్టూడెంట్స్ వాళ్ళను పట్టుకొని చావగొట్టబోతూవుంటే వాళ్ళు, "క్షమించండి బాబూ!" అంటూ పారిపోయారు.

ఆనాటినుండి రైలు ప్రయాణాలంటే భయం పోయింది అసలు భయపడటం అనేదే మనకు చాలా నష్టం అట! భయపడే స్త్రీలను చూస్తేనే రైల్వే రోమియోలు ఉత్సాహంగా ముందుకు దూకుతారు అన్నది తన పరిశీలనానుభవం. అడవిలో కూడా భయపడే మృగాలనే క్రూరమృగాలు వేటాడుతాయట అలాటి భయపడే జంతువుల దేహాన్నుండి ఒకవిధమైన వాసన వెలువడుతుందట! ఆ వాసనను గ్రహించాక క్రూరమృగాలు విజృంభించి, ఆ భయపడే మృగాలను చంపుతాయట! తను చంపదగిన మృగం అయినా కొన్ని విపరీతపు పరిస్థితులలో భయపడక ఎదురుతిరిగితే, అంటే భయం వాసన సోకకపోతే క్రూరమృగాలు వేటాడక వెనుకకుతిరిగి పోతాయట!

ఈ నవనాగరిక పట్నాలు అనబడే అరణ్యాలలో గూడా రోడ్ సైడ్ రోమియోలనబడే వారికి భయపడే స్త్రీ, భయపు వాసన తెలుస్తుందో కాబోలు!

జులపాల కుర్రాడు హడావిడి చేస్తున్నాడు చేతిరుమాలుతో విసురుకుంటున్నాడు పెట్టెలో పలుమూలలా వెదికి ఫ్యాన్ స్విచ్చిని గమనించి, లేచి ఫ్యాన్ వేశాడు కాని ఫ్యాన్ తిరగలేదు "డర్టీ రైల్వేస్! యూస్‌లెస్ గవర్నమెంటు!" అని విసుక్కుంటున్నాడు

సంధ్య క్రీగంటనే అతడి ముఖాన్ని స్టడీ చేసింది వేషం పెద్ద బ్యాంక్ ఆఫీసర్లాగా వున్నా, ఆ ముఖంలో వేషానికి తగ్గ విజ్ఞానం, హుందా కనబడలేదు వీడో డాబుసరి ప్రయాణీకుడు అని అనుకుంది

సంధ్య విసుగ్గా వాచీ చూసుకుంది నాలుగుగంటలా పన్నెండు నిముషాలు అయింది తన హేండ్ బాగ్‌ను విప్పి, అందులోని వారపత్రికను తీసి చదువుకుంటున్నది సంధ్య మనస్సు వారపత్రికలో లగ్నంకాలేదు స్వరూపరాణి ఇంట్లో జరుగబోయే పెండ్లిచూపులపైనే ఆమె మనసు లగ్నం అయింది

అదేంటి? సాయంకాలం ఆరున్నరగంటలకు పెండ్లిచూపులు పెట్టుకున్నారు? బహుశః ట్యూబ్‌లైట్ క్రింద స్వరూపరాణికి జిగిబిగేల్మని మేకప్పు చేసి చూపించాలనుకుంటున్నారేమో? స్వరూపరాణి చామనఛాయకలది ఐనా, ముఖంలో కళ గూడా లేదు బలిష్టంగా, పొడుగ్గా, టాంబాయ్‌లాగా వుంటుంది ఇప్పటికే స్వరూపరాణికి చాలా సంబంధాలు చూశారు 'కుర్రాడు పొట్టి! నల్లగా వుంటాడు! ఆడబిడ్డలు ఎక్కువగా వున్నారు! ఇలాగా వంకలుపెట్టి చాలా సంబంధాలు ఒద్దనేసింది స్వరూపరాణి స్వరూపరాణి స్పెసిఫికేషన్సు ప్రకారం, పెండ్లికుమారుడు పొడగరిఅయి వుండాలి! ఫెయిర్‌గా స్ట్రాంగ్‌గా వుండాలి! మంచి ఉద్యోగస్తుడుగా వుండాలి! పెండ్లికుమారునికి తల్లి చెల్లెండ్లూ వుండగూడదు! ఇవీ ఆమె కోరికలు!

ఒకసారి స్వరూపరాణిని తను మందలించబోయింది 'స్వరూపా! మరీ మనం అంత టెక్కుగా వుండగూడదు ఏవో నాలుగు సంబంధాలలో కాస్త మంచి సంబంధం చూసుకోవాలి అస్తమానం ఇలా వంకలుపెడ్తే చాలా ఇబ్బందులకు గురికావచ్చు మా బంధువులలో

ప్రకృతి సిద్ధమైన శక్తుల అణువులకి సంబంధించిన భౌతిక శాస్త్ర పరిశోధనలు గావించిన హార్వర్డ్ విశ్వవిద్యాలయానికి చెందిన ఈ ప్రొఫెసర్లు యిద్దరూ క్లాస్‌మేట్స్. షెల్డన్ గ్లాషో, స్టీవెన్‌వీన్‌బెర్గ్ వీరిపేర్లు ఇద్దరి వయస్సు 46 సంగలే. 1979 వీరిక్కి నోబెల్ బహుమతిని వీరు యిద్దరూ పాకిస్తాన్‌కి చెందిన అబ్దుస్ సలీమ్‌తో కలిసి పంచుకున్నారు



సీరియల్:

# సుదూర తీరాలు

పాటిబండ్ల విజయలక్ష్మి

(గత సంచిక తరువాయి)

సాయంత్రం మాష్టారు పిలవారనగానే వచ్చి చేతులు కట్టుకుని నిలబడ్డ లక్ష్మయ్య ఆయన ప్రాధేయపూర్వకంగా చెప్పినమాటల్నివిని, "మాష్టార్గూ! పెద్దోరు మీరు మమ్మల్నింతగా అడగాలా? మాకూ బిడ్డా పాపా వున్నారు. కష్టం, సుఖం తెలుసయ్యగోరూ? మల్లెమ్మను మా కంట్లో పాపనాగా చూసుకుంటాం! మీరేం భయపడకండి" అంటూ భరోసాయిచ్చాడు.

తృప్తిగా నిట్టూర్చారు మాష్టారు.

తెల్లవారే మల్లికోసం ఓ చిన్న పాక కట్టడంలో నిమగ్నమయ్యారు, మాలపల్లెవాళ్లు. మమతున్న మనసులు వాళ్లవి. మనసున్న మనుషులు వాళ్లు. అందుకే అంతక్రితం రోజు, మున్సబుమనుషులు "మల్లిని వెలివేశాం, మిమ్మల్ని డిగితే మీరూ చోటివ్వకండిరా" అని చెప్పిపంపినా, అంతా కలసి కట్టుగా, ఒక్కమాటమీద వుంటారు కనుక, మున్సబుకు వ్యతిరేకంగా మల్లికాశ్రయం యివ్వడానికే నిశ్చయించుకున్నారు. వూరి పెద్దలతో వాళ్లకెంత అవసరమో వాళ్లతో వూరి పెద్దలకూ అంతే అవసరమున్నపుడు, వాళ్ళకు ఆ పెద్దరికాలకు తలవంచవలసిన పని లేకపోయింది. అందుకే వసానంగానే వాళ్ళతలలే నంచారు మల్లి మాల గూడెం చేరింది. మాష్టారే దగ్గరుండి కావలసిన అన్ని సామానులూ యిచ్చి వచ్చారు. మల్లి పరిస్థితి ఆయన ఆరోగ్యం మీద కూడా బాగానే దెబ్బతీసింది. మల్లికి టానిక్కులన్నీ కొని యిచ్చారు. "అప్పుడప్పుడూ నేనే వచ్చి చూస్తాలేమ్మా! వాళ్ళ మాట ప్రకారం నువ్వు వూళ్ళోకి రాకు" అంటూ కళ్లు తుడుచుకుంటూ, నిలబడ్డారు మాష్టారు!

"మాలవాళ్ళ మధ్య వున్నా మనసున్న మనుషుల మధ్యనే వున్నాను మాష్టార్గూ! నన్ను గురించి మీరేం బాధపడకండి. శ్రమ పడి యిక్కడివరకూ రోజూ నడిచిరావద్దు. ఎప్పుడైనా చూడాలనిపించినప్పుడు లక్ష్మయ్యతో కబురు చెయ్యండి, మన పొలం దగ్గరికి వస్తాను. అక్కడ మీరెలాగూ పాక వేయించుకున్నారు కదా! అక్కడే కూర్చొని మాట్లాడుకోవచ్చు" అంటున్న మల్లితో "అలాగేనమ్మా! నీకే అవసరం వచ్చినా నేనున్నానని గుర్తుంచుకో తల్లీ" అంటూనే వెళ్ళిపోయారు మాష్టారు

* * *

మల్లి గూడెంలో అందరితో కలసి వాళ్ళతో పాటు పొలాలకు వెళ్ళి పనులు చేసుకోడం అలవాటు చేసుకుంది. అలా పొలంలో పనికి వెళ్ళిన ఒక రోజు, ఒంటరిగా వున్న మల్లిని చూసి చెయ్యి పట్టుకున్న పరమేశాన్ని చెంప పగలగొట్టింది మల్లి.

"ఆ సూర్యంగాడికంటే తీసిపోయానటే..." అంటూ మీదికి రాబోయిన పరమేశం,

ఎదురుగా కొడవలి పట్టుకుని వస్తున్న లక్ష్మయ్యను చూసి పారిపోయాడు. లక్ష్మయ్య గుండెల్లో తలదూర్చి బావురుమంది మల్లి.

"వూరుకో తల్లీ! వాణ్ణి చాన్నాళ్ళుగా చూస్తున్నా. ఎప్పుడో నాచేతిలో చావు దెబ్బలు తింటాడు, ఎదవని ఎదవ. మున్సబు కొడుకైతే బయపడి లొంగుతారనుకుంటాడేమో, మొన్న ఆ మాలచ్చిమి దగ్గర కూడా యింటో పేలాడంట పారిపోయి బతికిపోయ డుగాని, నాయాల్ని..."

అంటూ ఆవేశంగా అరుస్తున్న లక్ష్మయ్యను ఆపుతూ,

"వూరుకో తాతా! నన్ను గురించి నువ్వు వాళ్ళతో గొడవ పెట్టుకోకు. ఎవళ్ళ పాపాన వాళ్ళే పోతారు." అంటున్న మల్లి వైపు ఆదరంగా చూస్తూ,

"నీకు రావల్సిన కష్టంకాదు తల్లీ యిది" అంటూ చెమ్మగిల్లిన కళ్ళను అద్దుకుంటూ, "అన్నట్టు మాష్టారు చూడాలన్నారమ్మా, యియాల సాయంత్రం ఓ పాలి అయ్యగారి పొలం దగ్గరకెళ్లమ్మా!" అంటూ ముందుకు సాగిపోయిన లక్ష్మయ్య వైపు కృతజ్ఞతగా చూస్తూ తల వూపింది మల్లి.

మల్లీ, మాష్టర్గూ కష్టం సుఖం మాట్లాడుకోడానికి పొలంలో పర్ణశాలలాగా మాధవ్ కట్టించిన పాక అనువుగా వుంది. అటు వూరికీ యిటు మాలగూడానికీ మధ్యన వుంది.

ఆ రోజు మల్లితో మాట్లాడి ఏదో ఆలోచిస్తూ పాకలో పడుకున్నారు మాష్టారు. మల్లి వెళ్ళిపోయింది. లక్ష్మయ్య వెళ్ళిపోయాడు. పడుకున్న మాష్టారికి అలాగే కన్ను మలిగింది. 'యింటి దగ్గర తనకోసం ఎదురు చూసే వాళ్ళు మట్టుకు ఎవరున్నారు కనుక?' అందుకే అప్పుడప్పుడూ ఆ పాకలోనే పడుకొని నిద్రపోవడం అలవాటైంది. పచ్చటి పంట పొలాల్ని చూస్తూ ఆ పాకలో వుండటమే ఆయనకు హాయిగా వుంటుంది వూళ్ళోకంటే

పరమేశం కడుపులో కక్ష రగులుకుంది. మాధవ్ పట్టిపుణ్యానికి తనని బాదేశాడు. ఎవడితోనో లేచిపోయి కడుపు తెచ్చుకుని వచ్చిన దాని చెయ్యి పట్టుకుంటె అది తప్పైందట. ఆ విషయం ఆ ముసలాడు వూరిపెద్దలందరిముందూ చెప్పితననూ, తండ్రిని కూడా అల్లరిపెట్టాడు. వాడి అండ చూసుకునే దానికాధైర్యం. ఆ రాత్రి పొలాల దగ్గర కాపు వేసి, మాష్టారు పడుకున్న పాకకు నిప్పంటించి ఎటువాళ్ళటు పారిపోయారు, పరమేశం ముఠా. న్యాయంగా ఆ మంటలు వూళ్ళోవాళ్ళకే బాగా కనబడతాయి. కానీ అది మున్సబు చేయించిన పని అని అనుమానమొచ్చిన ఎవ్వరూ, అటు పరుగెత్తడానికి సాహసించలేదు.

ఎగసిపడుతున్న మంటలు చూసి మాలగూడెం మొత్తం, కడవలతో కుండలతో పరుగెత్తుకొచ్చి మంటలార్పారు. మాష్టారిని బయటికి తీసుకు వచ్చారు. కానీ ఆ దుర్ఘటన ఆయన కళ్ళ కాంతిని బలి తీసుకుంది. ఏడుస్తూ ఆయనతోనే వుండిపోయింది మల్లి.

అంతా అరిపోయిం తర్వాత వేంచేసి పరామర్శించారు వూరి పెద్దలు. పైగా మల్లిమీద జాలి చూపించబట్టే ఆ పాపానికే మాష్టారి కళ్ళు పోయాయని కొత్త కథ అల్లారు.

వాళ్ళకెవరూ సమాధానం చెప్పలేదు. మాష్టారిని యింటికి తీసుకు వెళ్ళారు. ఆ పరిస్థితుల్లో ఆయన్ని వదిలి వుండటం అసాధ్యమనిపించింది మల్లికి. తానూ వాళ్ళతో పాటు వూరి వైపు అడుగు వేసింది. "నువ్వెక్కడికి మహాతల్లీ! యిప్ప

***జరిగిన కథ-8:*** స్కూలు మాస్టరు దశరధరామయ్యగారి కుమారుడు మాధవ్ ఓ కంపెనీలో మేనేజర్. వారింట్లో వంట చేస్తున్న అన్నపూర్ణమ్మ కూతురు మల్లిచే మాధవ్ తను వ్రాసిన పాటలు పాడించుకొంటూ పరస్పరానురాగబద్ధులవుతారు. కాని అతని పల్లెటూరి వేషధారణ మాత్రం ఆమెకు నచ్చదు. మున్సబుగారు మాధవ్‌ను తన అల్లుడిగా చేసుకోవాలని పథకం వేస్తుంటాడు. మల్లిని మంచి గాయనిగా గుర్తించి తమ పిక్చర్‌లోని పాటలు పాడటానికి, గొప్ప గాయనిగా పేరు ప్రతిష్టలు పొందటానికి తనతో మద్రాసు రమ్మని అర్థిస్తాడు సూర్యం. అతని మాటలను నమ్మిన మల్లి ఆ మరునాటి రాత్రి ఎవ్వరికీ చెప్పకుండా అతనితో వెళ్ళిపోతుంది. ఆ కారణంగా ఆమె తల్లి ఆ అవమానం భరించలేక ఆత్మహత్య చేసుకొంటుంది. సూర్యం అసలు రంగు ఆమెకు అవగాహన అవుతూవుంటుంది. అతడు అందమైన అమ్మాయిలను ఆకర్షించి, తను అనుభవించి కాంతిమతికి అప్పచెప్తుంటాడు. అతను పన్నిన వలలో చిక్కుకున్న మల్లిని కూడా అనుభవిస్తాడు. కాని ఆమెకు అన్యాయం చెయ్యలేక వివాహానికి ఆమె అనుమతిని కోరతాడు. ఇక వేరే గత్యంతరం లేక తన మెడలో పసుపుకొమ్ము తనే కట్టుకొని సూర్యం కట్టినట్లుగా భావించుకొంటుంది మల్లి. ఆ విషయం రామూ ద్వారా తెలుసుకున్న కాంతిమతి సూర్యంను చంపిస్తుంది. ఈ విషయం పోలీసులకు చెప్పటానికి వెళ్తున్న రామూని కొట్టిస్తుంది. మల్లికి ఆ నరకకూపమునుంచి తప్పించుకొనే మార్గం చెబుతుంది వసంత. ఆమె చెప్పిన ప్రకారం అక్కడినుండి తప్పించుకొని తన వూరు చేరుకొంటుంది మల్లి. అప్పటికే ఆమె గర్భవతి. ఆమెను ఆ వూరి ప్రజలు వెలివేయ నిశ్చయించుకొంటారు.



చక జరగింది చాలు, వెళ్ళు'' అంటూ కసిరాడు మున్సబు, అదంతా మల్లే చేసిందన్నంత తీవ్రంగా. ఏడుస్తూ ఆగిపోయింది మల్లి.

లక్ష్మయ్య ముందుకు వెళ్ళాడు మల్లి భుజం తట్టి.

మల్లి తిరిగివచ్చి రెండు నెలలు కావస్తోంది. ఈ రెండు నెలల్లో మాధవ్ మళ్ళీ ఒక్కసారైనా రాలేదు. లెటర్స్ మట్టుకు రెగ్యులర్‌గా వ్రాస్తున్నాడు. అయితే అవి చాలా క్లుప్తంగా క్షేమసమాచారాలతో సాగేవి. మాష్టారు మల్లి కోరిక మీద మల్లి వచ్చిన విషయం వ్రాయలేదు. నిరాశగా.నిస్పృహగా సాగే కొడుకు వుత్తరాలు చూసినప్పుడు వెంటనే రమ్మని రాద్దామనిపించేది. మళ్ళీ మల్లికిచ్చిన మాట జ్ఞాపకంవచ్చి వూరుకునేవారు. మల్లితో కూడా అంతక్రితం రోజే అన్నారు. ''మాధవ్‌ను చూడాలని వుందమ్మా! ఓసారి నేనే విజయవాడ వెళ్ళి వస్తాను. వాడు కళ్ళలోనే మెదులుతున్నాడు.'' అంటున్న ఆయన కంఠం రుద్ధమైంది.

మల్లికిమాత్రం చూడాలని లేదూ! కానీ తన ముఖం అతనికి చూపించే ధైర్యంలేకే రమ్మని వ్రాయవద్దని, తాను వచ్చినట్లు తెలియ జేయవద్దనీ చెప్పింది మాష్టారుతో.

ఇక...ఇప్పుడు మాష్టారు శాశ్వితంగా మాధవ్‌ను చూడలేరని తెలిసిన తర్వాత మల్లికి తన మీద తనకే అసహ్యం పుట్టింది. తన మూలాన కదూ ఆయన కొడుకును కూడా దూరం చేసుకొని వుండిపోయారు. తను వుండి ఏం ప్రయోజనం? ఆయనకు ఏరకంగానూ సేవచేయలేని దౌర్భాగ్యపు స్థితిలో వుంది. భగవాన్! పగవాళ్ళకు కూడా యిలాంటి శిక్ష విధించకు. అయిన వాళ్ళకు దగ్గరగా వుంటూ, వాళ్ళకు దూరంగా మసల వలసి రావడం కంటే దౌర్భాగ్యం మరొకటి లేదు. కంటికి మంటికి ఏక ధారగా ఏడుస్తోంది మల్లి.

తిరిగొచ్చిన లక్ష్మయ్య చెప్పాడు, కళ్ళుతుడుచుకుంటూ. ''మాష్టారి బాధ చూడలేకుండా వుందామమ్మా! రెండు కనుగుడ్లూ పూర్తిగా మాడిపోనాయంట. దరమ ప్రభువులు ఆరికి రావలసిన కట్టం కాదు. ఏ మున్సబులాంటోళ్ళకో రావలసిందీ కష్టం! మాష్టారు ఒకటే కలవరిస్తా వున్నారమ్మా! 'మధూ! మధూ! మల్లీ! మల్లీ!' అంటూ. పాపం మధుబాబుకు తెలిస్తే గుండె పగులుతాది తల్లీ! మీరెల్లి పోయిన కాడనుంచీ ఆ బాబు మనూరినే మరిచిపోయినాడమ్మా! అమ్మా! ఏమైనా సరే యీ విషయంలో మా తలలెగిరి పోయినా బాధనేదు. ఒక మంచిపని చేశామనే తురిపితైనా మిగులుద్ది! పద తల్లీ వూళ్ళోకి. నేను, మరో పదిమంది మీ సుట్టూ వుంటాం! ఎవడడ్డమొస్తాడో చూస్తాం!'' అంటూ అప్పటికప్పుడు పది మంది కర్రలు పట్టుకొని మల్లిని వెంటబెట్టుకొని ఊళ్ళోకి అడుగుపెట్టారు. మున్సబు మనుషులు ముందుకు రాబోయారు. కానీ చెయ్యడ్డంపెట్టి ఆపుజేసాడు మున్సబు. ఊళ్ళోవాళ్ళకంటే మాలవాళ్ళలో ఐకమత్యం యెక్కువ. ఎటుపోయి ఎటువచ్చినా లాభనష్టాలు బేరీజులు వేసుకొని, అప్పటికి మౌనం వహించడమే ఉత్తమమైన మార్గమని, వాళ్లనాపాడు మున్సబు.

మాష్టారు బాధతో ఏడుస్తూ ''మధూ! మధూ!'' అంటూ కలవరిస్తున్నారు. వెళ్ళి ఆయన కాళ్లను చుట్టేసిన మల్లి,

''మాష్టారూ! ఈ పాపిష్టిదానికి ఆశ్రయమెందుకిచ్చారు మాష్టారూ. నా దురదృష్టం మిమ్మల్ని కాటేసింది. బావ కిప్పుడే టెలిగ్రాం యిప్పిస్తాను'' అంటూ ఏడుస్తూ పుస్తకాల బీరువా దగ్గరకు పరుగెత్తి, డైరీలో వున్న అడ్రసు వ్రాసి వెంటనే బయలుదేరిరమ్మని మాధవ్‌కు టెలిగ్రామిమ్మని రమణను పంపింది.

డాక్టర్ వచ్చి ఏదో మందువేసి కట్టుకట్టారు. కొంత బాధోపశమనం కలిగినా మాష్టారు విపరీతంగా బాధపడటం గమనించిన మల్లి ఏమీ చేయలేని తన అశక్తతను తలుచుకొని ఏడుస్తూ కూర్చుంది.

# సుదూర తీరాలు

## పెరుగుతున్న సంవత్సరాలు-

# కాల్షియం-శాండోజ్ సంవత్సరాలు







పాప పుట్టక ముందు నుంచే, పాప యొక్క పళ్ళూ ఎముకలూ రూపొందటం మొదలెడతాయి. పసిదనం నుంచీ, పెరిగే వయస్సులో అంతా కూడా కాల్షియం ఎంతో కీలకమైనది.

మీ పాపకి గనక, పెరుగుతున్న ఏ దశలోనైనా సరే, అవసరమైనంత కాల్షియం లభించకపోతే, తరవాత ఎంత యిచ్చినా ప్రయోజనం ఉండదు. అందుకే నేడే మీ పాపకు కాల్షియం-శాండోజ్ యివ్వడం మొదలెట్టండి. రోజుకు నాలుగు కాల్షియం-శాండోజ్ బిళ్ళలు గనక యిస్తే, అవి పెరిగే దశలోని ఆ ఏళ్ళలో అత్యవసరమైన కాల్షియంను సమకూర్చి, గట్టిపళ్ళనూ, పటిష్టమైన ఎముకలనూ రూపొందిస్తాయి. విటమిన్ సి, డి మరియు బి$^{12}$తో పటిష్ఠం చేయబడిన కాల్షియం-శాండోజ్ బిళ్లల్లో, పిల్లలకి యిష్టమయ్యే రుచిగల వెనీలా సువాసన ఉంది.

కాల్షియం-శాండోజ్ స్విట్జర్‌లాండ్‌లోని శాండోజ్ వారు రూపొందించినది, ప్రపంచంలోని అత్యుత్తమమైన కాల్షియం.




# కాల్షియం-శాండోజ్®

## గట్టిపళ్ళు, పటిష్టమైన ఎముకల కోసం




daCunha/CS/26 TEL





పైన : ''శివమెత్తిన సత్యం''లో కృష్ణంరాజు, జయసుధ
క్రింద : ''ఛాలెంజ్ రాముడు''లో సత్యనారాయణ, గీత

తెల్లవారి సాయంత్రానికి వూరు చేరిన మాధవ్‌కు తండ్రిని ఆ పరిస్థితుల్లో చూసి ఏం చేయాలో పాలుపోలేదు. పసిపిల్లవాడిలా ఏడుస్తూ కూర్చున్నాడు ఆయనతోపాటు. బావ కెలా ముఖం చూపించాలి? భూమి బ్రద్దలై తను అందులో కూరుకుపోతే బావుండునని పిస్తోంది మాధవ్ హాల్లో వున్నంతసేపూ దొడ్లోనే వుండిపోయింది. రెండోరోజు కూడా అతను స్నానానికి దొడ్లోకి వస్తే అన్నీ అమర్చిపెట్టి, పక్కకు తప్పుకుంది రాత్రికి కూడా అలాగే భోజనం కలిపి మాష్టారికి తినిపించి లోపలి

## సుదూర తీరాలు

కెళుతుంటే సడన్‌గా, లోపలి కొచ్చేశాడు మాధవ్.

దిగ్గున లేచి దొడ్డి వాకిలివైపు పోబోతున్న మల్లి చేయి పట్టుకున్నాడు మాధవ్. తల వంచుకొని నుంచున్న మల్లి కళ్ళ నుంచి టప్ టప్ మని జారుతున్న కన్నీళ్ళు మాధవ్ పాదాల్ని అభిషేకం చేస్తున్నాయి.

''నానుంచి పారిపోవాలనుకుంటున్నావా మల్లీ! సమాధానం చెప్పు మల్లీ! నేనంత పరాయివాడినై పోయానా? అన్నివిషయాలూ నాకు తెలిశాయి ఇందులో నీ తప్పేం వుందని నువ్విలా తప్పుకు తిరుగుతున్నావు?'' బాధగా ఆత్మీయంగా ధ్వనిస్తున్న ఆ కంఠం వింటూ అతిదగ్గరైన స్పర్శ తన భుజాన్ని తాకుతుంటే మల్లికి మరచిపోయిన మధుర స్మృతులను జ్ఞాపకం చేస్తుంటేగానీ, తెలిసిరాలేదు తనలో యింకా స్పందించే హృదయం వుందనీ, అది పాషాణం కాదనీ, మాధవ్ స్పర్శ మాత్రానే అది మంచులా కరిగి నీరౌతుందనీ ... ఏడుస్తూ ముఖం కప్పుకొని మాధవ్ కాళ్ళమీదకు వొరిగిపోయిన మల్లిని చూస్తుంటే వుద్వేగంతో ఏదో తెలీని వుద్రేకంతో పెదవులు అదురుతుండగా మృదుగంభీరంగా పిలిచాడు మాధవ్.

''మల్లీ! నేను బ్రతికేవున్నానన్న సంగతి నీకు తెలుసా?'' అంటున్న మాధవ్ వైపు బేలగా చూస్తూ ''బావా!'' అని ఏడుస్తున్న మల్లి ముఖం మీద నుంచి చేతులు తప్పిస్తూ కన్నీళ్ళతో మలినమైన ముఖాన్ని తన రెండు చేతుల మధ్యా వుంచుకొని,

''మల్లీ! నిజం చెప్పు. నేను బ్రతికున్నానని తెలిసే నీ నుదుట కుంకుమ చెరిపేసుకున్నావా? అంటే సూర్యంను, నువ్వంతగా ప్రేమించావా? అతని ప్రేమ, నీ చిన్నప్పటి చెలికాడిని, నీ ఆరాధకుడిని బావను కూడా మరపింపజేసిందా? మనిషికి మాంగల్యంకంటే మనసే ప్రధానమని వాదించేదానివి. మనసిచ్చి పుచ్చుకున్నతర్వాత మాంగల్యం కట్టినా కట్టకపోయినా మనసులు కలసిన మనుషులు భార్యాభర్తలేనని నాతో ఎన్నిసార్లు వాదించావు? అదంతా అబద్ధమేనా? నేను నీకేమీ కానా? అంటే నీ మనసున సూర్యం...''

''బావా! ప్లీజ్ నన్ను చిత్రవధ చేయకు. అతనికోసం కట్టుకోలేదా పసుపుతాడు. నా రక్షణ కోసం, మిగతా రాబందుల బారినుంచైనా నన్ను నేను రక్షించుకోడానికి కట్టుకున్నానా ఉరితాడు అది నాకు మాత్రమే ఉరితాడు కాదు, సూర్యానికి కూడా ఉరితాడేనని నిరూపించింది ఇంక దాని అవసరంలేదని తీసేశాను. సమాజంలో నేను మళ్ళీ మల్లిగా మామూలుగా బ్రతకకుండా నాకూ ఓ శిక్షవిధించి పోయాడు సూర్యం. అతని ప్రతిరూపాన్ని మోసే నేను అతని విధవను కాదు, మనసిచ్చిన నా బావ మాధవ్ భార్యనంటే దుమ్మెత్తిపోస్తుంది లోకం. అందుకు నా మనస్సునుట్టు కెలా అంగీకరిస్తుంది? కళంకినినైన నేను మాధవ్ భార్య ననుకొని బొట్టు ఎలా పెట్టుకోను? ఈ పరిస్థితుల్లో యిలాకాక ఇంకెలా బ్రతకను బావా'' అంటూ హృదయం కరిగి నీరయ్యేలా ఏడుస్తూనేవుంది మల్లి.

దేవుడి గదిలో కెళ్ళిన మాధవ్ కుంకుమ వేలికి అంటించుకొని ఓ క్షణం కళ్ళు మూసుకొని మల్లి నుదుట బొట్టుపెట్టాడు.

''బావా!'' అంటూ బాధగా అరిచిన మల్లి వైపు చూసి ప్రశాంతంగా నవ్వుతూ,

''ఇంక ఇలాగే బ్రతకాలి. మాధవ్ భార్యగా. అప్పుడు నిన్ను ఎవరు వెలివేస్తారో చూస్తాను'' అన్నాడు నిండుగా, నిశ్చలంగా



ఈ బొమ్మలో కనిపిస్తున్న వల పశ్చిమ జర్మనీలోని ఒక కిండర్‌గార్డెన్ స్కూలు పిల్లలకు ఒక ఆటస్థలమైంది. స్కూలు భవనం మరమ్మత్తులకోసం, ఒక తరగతిని రెండవ అంతస్తులోకి మార్చారు. పిల్లల శ్రేయస్సుదృష్ట్యా, అత్యవసర పరిస్థితిలో బయటకు వెళ్ళేందుకు మార్గం ఏర్పరచమని హౌసింగ్ డిపార్ట్‌మెంట్‌వాళ్ళు ఒత్తిడిచేశారు. ఒక అద్భుతమైన ఆలోచనవలన యీ వలను ఏర్పాటుచేశారు. కిటికీలోనుండి వల ద్వారా స్కూలు తోటలోకి పోవచ్చు. ఇదే సరదాగా వుంది పిల్లలకు.

# సుదూర తీరాలు

"బావా! అంతటి అదృష్టమే నాకుంటే నేనలా మార్గాన్ని నమ్ముకొని వెళ్ళివుండేదాన్నేకాదు. నాతోనే మీకు కష్టాలు ప్రారంభమయ్యాయి. కళకళలాడుతుండే ఈ యిల్లు శ్మశానంలా తయారయింది. అమ్మను పోగొట్టుకున్నాను. మాష్టారి కళ్ళు పోగొట్టాను. నా దురదృష్టం నిన్ను వరించనివ్వను మధూ! అది నీ భవిష్యత్తును అంధకారబంధురం చేస్తుంది. పైగా నేనా పాపాన్ని నా గర్భాన మోస్తున్నాను" అంటూ ముఖాన్ని చేతుల్లో దాచుకొని వెక్కివెక్కి ఏడుస్తున్న మల్లి వైపు ప్రేమగా చూస్తూ,

"మల్లీ! ఏమన్నావ్! మధూ అని కదూ! నీనోట ఆ పిలుపు వినాలని ఎన్నాళ్ళుగా తపిస్తున్నానో నీకేం తెలుసు? నీతి, అందరికీ ఒక్కటే మల్లీ! నీ గుండెలమీద చేయుంచుకొని చెప్పు నువ్వు నన్ను మరచిపోయ్యావని ... ఊహూ! చెప్పలేవు. మరి నేనూ అంతే. నా ప్రతి ఊపిరిలో, నీ స్మృతి, రగిలిస్తూనే వుంది యిన్నాళ్ళూ. మలినమైంది మమతానురాగాల కతీతమైన దేహమేకానీ నీ మనస్సు కాదు. మల్లెపువ్వంత స్వచ్ఛంగా నా మనసులో నువ్వున్నావు. నీ మనసూ అంతే స్వచ్ఛంగా వుందని నాకు తెలుసు. నా నిర్ణయానికి తిరుగులేదు. నువ్వింక నిశ్చింతగా ఏ దిగులూలేకుండా వుండు. పుట్టే బాబుకు తండ్రిని నేను" అంటూ లేచి నుంచున్న మాధవ్ పాదాలమీద వాలి కన్నీళ్ళతో అభిషేకించింది మల్లి.

మనసంతా చెవులుచేసుకొని అతను చెప్పిన ప్రతిమాట విన్నది. ఆ ప్రేమమూర్తికి మనసులోనే జోహారు అర్పించుకుంది. మల్లిని మెల్లగా లేపి కొనగోట కన్నీళ్లను చిమ్మి,

"మల్లి, మాధవ్‌కే సొంతం మరెవ్వరికీ కాదు" అంటూ వెర్రి ఆనందంతో బయటకు పరుగెత్తాడు మాధవ్

మనసంతా హాయిగా, గాలిలో తేలిపోతున్నట్లుంది మాధవ్‌కు మల్లి సమస్యకే కాదు, తన సమస్యకూ పరిష్కారం దొరికింది. మల్లి లేనిదే తను బ్రతుకలేడు. మూడు నెలల వియోగం మూడు యుగాలకు సరిపడ అనుభవాలను మిగిల్చింది యిద్దరికీ.

ఆరాత్రి మల్లి ఎదురుగా కూర్చుని అన్నం వడ్డిస్తుంటే కలిపిపెట్టమని సైగచేస్తున్న మాధవ్ వైపు చూసి మౌనంగా ముద్దలు కలిపి అందించింది మల్లి.

ఆప్యాయత ఆత్మీయత రంగరించి ముద్దలు కలిపిపెడుతున్న మల్లిలో ఏదో ఆరాటం ఏదో ఆవేశం.

ఆ క్షణంలో తనకు చిన్నప్పుడు గోరుముద్దలు తినిపించిన అమ్మలా కనిపించింది మల్లి మాధవ్‌కు ఆపేక్షగా ఆరాధనగా తన వైపు చూస్తున్న ఆ కళ్ళలో కదలాడే కన్నీళ్ళు మెరుస్తుంటే, పెదవులపై విరిసీవిరియని నవ్వులో విరిసీవిరియని విరిమల్లెలా, జన్మజన్మాల ప్రియబాంధవిలా అనిపించింది కన్నీళ్లతో మసకబారుతున్న కళ్లను మాటిమాటికీ తుడుచుకుంటూ ఆనందమో! ఆవేదనో తెలియని వింత అనుభూతితో వెలిగిపోతున్న ఆ ముఖం మాధవ్ మనసును తృప్తితో నింపింది.

తనివితీరా తన బావను చూడనివ్వని కన్నీళ్లను మాటిమాటికీ తుడుచుకుంటూ ఆపేక్షగా ఆ సుందర విగ్రహాన్ని మనస్సులో మరింత పటిష్టంగా ప్రతిష్ట చేసుకుంటోంది మల్లి.

చాలారోజుల తర్వాత తృప్తిగా మల్లి చేతి భోజనం చేసిన మాధవ్ ఆరుబయట మంచం వేసుకొని పున్నమిచంద్రుడిని చూస్తూ నిశ్చింతగా కలలులేని కమ్మని నిద్రపోయాడు చాన్నాళ్ళతర్వాత.

ఉదయమే లేచి కళ్ళు మూసుకునే, అలవాటు ప్రకారం ప్రక్కలో వుంచుకునే వెంకటేశ్వరుని ఫోటో చేతుల్లోకి తీసుకొని కళ్ళు తెరిచాడు నవ్వుతూ. ఓ క్షణం కళ్ళు మూసుకొని ఏడుకొండలవాడిని స్మరించి, బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంటూ రెండు చేతుల్లోకి తీసుకున్న మాధవ్, దిండు క్రింద కనిపించిన తెల్లటి పేపర్ తీసి చూశాడు ఆశ్చర్యంగా కళ్ళు అక్షరాల వెంట పరుగులుతీశాయి.

నా మధూకు!

నీ ప్రేమ ఎంత పవిత్రమైనదో తెలుసుకోకుండా నిన్ను వదిలి, ఈ పల్లె వదలి, ఏదో సాధిద్దామనే వెర్రి ఆవేశంతో వెళ్ళిపోయినరోజే నా పతనానికి నేనే గోతులు తవ్వుకున్నాను. ఇన్నాళ్టికి మళ్ళీ నీ ప్రేమలోని మాధుర్యాన్ని అనుభవిస్తుంటే నాకు మళ్ళీ మనం ఒక్కసారి ఆ భూతకాలంలోకి వెళ్ళిపోతే ... అనిపిస్తోంది.

కానీ అది అసంభవమని నాకూ తెలుసు. స్వచ్ఛమైన నీ మనసుకు నేనెప్పటి మల్లినే... నువ్వన్నట్లు నా మనసు మళ్ళీ నీ ప్రేమతో మల్లెల్లోని స్వచ్ఛంధాన్నీ సుగంధాన్నీ నింపుకుంది. కానీ ...

బావా! మల్లెపూవు దేవతార్చనకు పనికిరాదు. ఈ విషయం నీకు తెలీదా? అందులోనూ నేను వాడిన మల్లెను. ఇక్కడేవుండి నీ ప్రేమ నుంచి తప్పుకొని తిరగటం నాకు సాధ్యంకాదు. అందుకే దూరంగా, నీకు అందనంత దూరంగా వెళ్ళిపోతున్నాను. సుదూర తీరాలకు సాగిపోతున్నాను. మన తీరాలు కలిసే అవకాశంలేదు బావా!

మరోమారు నిన్ను నమ్మించి మోసంచేసిపోతున్న నీ మల్లిని క్షమించగల ఔదార్యం, ఔన్నత్యం నీలో వున్నాయని నాకు తెలుసు మధూ! మాష్టారికి నా తుది నమస్కృతు లందజేయి. బ్రతుకు ముగిసేలోగా నీ సన్నిధికి చేరుకుంటాను మళ్ళీ. అది ఎప్పుడో, మధురమైన మన జీవిత స్వప్నాలను మంటగలిపిన విధే నిర్ణయించాలి.

కళంకాన్ని కొనితెచ్చుకున్న నన్ను స్వీకరించి, నీ ప్రేమతో పునీతం చేస్తానన్న నీ వ్యక్తిత్వం ముందు నేనో గడ్డిపోచను బావా! అయినా రాలిన పూవును మరల జీవింపచేయలేనుగా! మొగ్గ పక్వానికి రాకముందే పొరపాటునో గ్రహపాటునో రాలిపోతే .. దాన్ని మళ్ళీ మొక్కకు అతికించి పుష్పింపచేయటం సాధ్యంకాదు బావా!

ఎప్పటికీ నీదై ...నీకు కాలేకపోయిన
అభాగ్యురాలు
మల్లి

(అయిపోయింది)

చూపుకి
అందం
కంటికి
చలవ

అదే

# ఐటెక్స్

కాటుక



స్థానికమైన ఉత్తమ తైలముల మూలికల మిశ్రమంతో శాస్త్రరీత్యా తయారైనది ఐటెక్స్.




పెట్రోలియమ్ జెల్లీగాని, మైనంగాని, ఏ విధమైన రంగుగాని చేర్చబడనిది ఐటెక్స్.

కళ్ళకు కాంతి, చలవ ఆకర్షణలను కల్పించుటలో సాటిలేనిది ఐటెక్స్

35 ఏళ్లుగా మీ అపార విశ్వాసమునకు ఒక చిహ్నము ఐటెక్స్.

మీ సౌందర్యమునకు మీ కన్నులే జీవనాడి. దానికి సాటిలేని ఉత్తమమైన కాటుకనే వాడాలి. అదే ఐటెక్స్ కాటుక అని వేరే చెప్పాలా?

ARAVIND LABORATORIES MADRAS-600 033

21-12-1979 శుక్రవారం మొదలు
27-12 1979 గురువారం వరకు

# వారఫలం

**మేషం :** ఈ వారం భరణి నక్షత్ర జాతకులకు అధిక శుభం జరుగబోవుచున్నది. కన్యా రాశి శని గ్రహ అనేక రీతుల వ్యాపారం వ్యవహారానుకూలత కలగజేయుటం గమనించండి. ఇనుప వ్యాపారం, యంత్రాగం, హోదా ఉద్యోగులకు వారంలో ధనయోగం సంభవం. బంధుమిత్రులు ఇంటికి వస్తారు. స్త్రీలకు అన్ని రంగాల్లో ముఖ్యంగా కళా రంగంలో శోభ కనిపిస్తుంది.

**వృషభం :** మృగశిరా నక్షత్ర జాతకులకు, పల్కు విధాల బాగుండేవారం. రహస్యంగా అనేక పనులు చాలా మంది ప్రారంభించగలరు. ఆదాయం, అభివృద్ధి వృత్తిలో ప్రగతి చెప్పదగిన వారం. నూతనంగా విలువగల వస్తువులు కొంటారు. చాలామందికి ద్రవ్యాదాయం గలదు. వెంటనే అధిక వ్యయం ఉంటుంది. రాజకీయ రంగాభిమానంగల వారికి, చాల అవకాశాలుంటాయి. స్త్రీలకు వివిధంగా నష్టం కాని, కష్టకాలంగా కనిపించదు. వారంమధ్యలో చాల మందికి వస్తు వాహనాలు సమకూడగలవు.

**మిధునం :** ఈ వారంలో మీ నాటకు విలువ పెరుగుతుంది. ధనంబ్బింకలదు. నూతనావకాశాలుంటాయి. గృహ కార్యభారం అధికమవుతుంది. వృత్తిలో చాలామందికి ముందుకు పోయే అవకాశాలుంటాయి. గృహాలన్ని ఆదాయం చాల మందికి కనిపించేవారం. జౌళి వ్యాపారస్తులకు తెల్ల వస్తువుల వ్యాపారం చేసే వారికి లాభప్రదాయకవారం. స్త్రీలకు: సంఘ గౌరవం, రాజకీయ రంగంలో ప్రగతి, ధైర్యం, కోరిక ఫలించటం గమనించగలరు.

**కర్కాటకం :** మీ ఖ్యాతి కళారంగంలో విస్తరిస్తుంది. తలంచిన కార్యానుకూలత కల్గుటయేగాక, అనేక మార్గాల్లో, ముఖ్యంగా రచయితలకు, కళాకారులకు బాగుండేవారం. అపకారం చేయదలచేవారి ప్రయత్నాలు, చాలామందికి శత్రువర్గీయుల బాధ, ఋణదాతల వత్తిడి ఈ రాశి వారు గమనించగలరు. స్త్రీలకు: కళారంగంలో ఖ్యాతి లభిస్తుంది. ముఖ్య బంధువుల రాకపోకల వలన గృహ కార్యభారం, వ్యయం అధికం.

**సింహం :** ఇంకా మీ ఆరోగ్యం కుదుట పడలేదని గ్రహిస్తారు. వయసు మీరినవారు రక్తపు పోటువలన, ఉష్ణాధిక్యతవలన అనారోగ్యత కల్గుతుంది. గృహావసరాలు, అవసరమైన అవసరమవుతుంది. మీ తాలూకు వస్తువులు పోయ్యే అవకాశం, మతి మరుపువలన కొన్ని పనులు, ఆలస్యం, అచిరకాలంలో వానిని మరచిపోతారు. స్త్రీలకు: అనుకున్న కార్యాలు నెరవేరవు. ఆరోగ్యం బాగుండదు.

**కన్య :** మీ రాశిలో శనిగ్రహం అనేక విధాల మీ ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపుట గమనించగలరు. వృత్తి, ఉద్యోగాభివృద్ధి కనిపిస్తుంది. రావలసిన ద్రవ్యం సమయానికి చేతికందుతుంది. అందుకు తగిన వ్యయం పెద్దమవుతుంది. వ్యాపారం చేసేవారికి లాభదాయకవారం గాదు. స్త్రీలకు: సంఘ గౌరవం, మన్నన, పెద్దల అభిమానం సంభవం.

**తుల :** ఈ వారంలో మీరు ఆరంభించిన కార్యాలు అనుకూలంగా ఉంటవి. ఉపాధ్యాయులకు, వైదికవృత్తిలోని వారికి రచయితలకు ఉత్సాహవంతమైన వారం. ఉత్తేజకరమైనవారం. శత్రువర్గం లొంగిపోయే వారం. బాహాటంగా కృషి చేయండి. మీ వృత్తిలో అనుకూలత, ధనరాబడి చెప్పదగినవారం. చివరి రెండుదినాలు మీకు సర్వ విధాలా అనుకూలం. స్త్రీలకు: ఉద్యోగావకాశాలు, వయసులో ఉన్నవారికి శుభకార్య ప్రస్తావన చెప్పదగినవారం.

**వృశ్చికం :** మీకు రావలసిన డబ్బు అందుతుంది. మీలో చాలామంది ప్రారంభించిన పనులు లాభదాయకంగా ముగియగలవు. అపకారం తలపెట్టేవారుంటారు గాని, వారి ఆటలు సాగవు. స్త్రీల వలన మాట పట్టింపు లుండ గలవు. వారాంతంలో ప్రారంభించిన శుభకార్యాలు అనుకూలంగా నెరవేరగలవు. స్త్రీలకు: ఇంటికి వచ్చిన వారికి విందు వసతులు కల్పించుటలో కార్యభారం అధికం.

**ధనుస్సు :** మీతో కలసి వ్యాపార, వృత్తి, ఉద్యోగాలలో సంచరించేవారి వలన మాట పట్టింపులుంటాయి. చాలామందికి సంఘ వ్యవహారాల్లో, రాజకీయరంగంలో అనేక అవకాశాలుండగలవు. ధైర్యంగా కృషి చేయండి. లాభం సంపాదించండి. వ్యాపారానుకూలత సంభవం. కోర్టు కచ్చేరి వ్యవహారాలలో అనుకూల వార్తలు వినటం కూడ సంభవం. కార్యభారం అధికమైనా, ఓర్పుతో నిర్వహించండి. స్త్రీలకు: అన్నివిధాలా అనుకూలవారం.

**మకరం :** మీ రాశికి అష్టమ శని బాధ తొలగింది. క్రమంగా మీ ఆరోగ్యం అభివృద్ధి చెందుతుంది. పుస్తక విక్రేతలకు, కళారంగానుబంధంగల వారికి నూతనంగా అవకాశాలుంటాయి. ఉద్యోగ అభివృద్ధి, ద్రవ్యాదాయం గలదు వ్యాపారస్తులకు అనుకూలం. స్త్రీలకు: వస్తు వాహన లాభం గలదు. కుటుంబానందం గలదు కృషి చేయండి. ఆదాయం సమకూరుతుంది.

**కుంభం :** మీ శక్తి సామర్థ్యాలకు పరీక్షా సమయం. చిత్ర నిర్మాతలకు, భారీ వ్యాపారస్తులకు అధికలాభదాయకమైనవారం. వారం చివరి రెండురోజులు, మీకు లాభం చేకూర్చేదినాలు. మానసికంగా మీకు శుభమైనవారం. ఆనందోత్సాహాలుంటాయి. స్త్రీలకు: అధిక వ్యయం, కార్యానుకూలత చెప్పనలవిలేదు.

**మీనం :** మీకుగల ప్రత్యర్థులు, ఈ వారం. సూరలా తలయెత్తగలరు. అసలే అనేక విధాల, ఇబ్బంది పడుతున్న మీకు, కష్టం కలిగించాలని చూస్తారు. ఆదాయం కూడ స్వల్పమే వ్యయం మాత్రం తప్పని సరి అవుతుంది భూవిస్తరణ కార్యక్రమం కుంటుపడుతుంది స్త్రీలకు: ఉద్యోగ, వ్యాపార కళారంగాలలో అభివృద్ధి గలదు.

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి








**''అత్తమ్మా అత్తమ్మా నిన్ను అరిజెంటుగా రమ్మని నాయన పంపిండు'' ఒగర్చుకుంటూ వచ్చింది శాయి.**

చుట్టు గుడిసెలో వట్టింట కొంగు పరుచుకొని పడుకున్న రంగమ్మ కళ్ళు నులుపుకుంటూ లేచింది తల వెంట్రుకలను కలిపి మళ్ళీ ముడివేసుకుని శాయి వంక ఒకసారి చూసింది. లేచి కుండలో నీళ్ళు ముంతెడు తాగి ''ఏందే ఇప్పుడొచ్చినవ్ ?'' అడిగింది.

''ఏందో నాకు తెలవదు. నాయన నిన్ను కోలుకురమ్మన్నడు'' తలుపు మీద గీతలు గోళ్ళతో గీస్తూ అన్నది శాయి.

రంగమ్మకు అప్పుడు జ్ఞాపకం వచ్చింది. శాయికి తండ్రి పెళ్ళి సంబంధాలు చూస్తున్నాడు. మంచిరోజు చూసి పూలూ పళ్ళూ పెట్టాలని చెప్పాడు. ఇప్పుడు పదకొండు గంటలయి ఉంటుంది. సాయంత్రం ఒకవేళ పెళ్ళివారు వస్తారేమో!

రంగమ్మ ఆ ఊరికి కోడలిగా వచ్చింది. శివయ్యతో ఏ పదేళ్ళు కాపరం చేసిందో— అంతే. కలరా జాడ్యం ఆ ఊరి జనంలో సగం మందిని తీసుకుపోయింది. వాళ్ళల్లో శివయ్య ఒకడు. ఆతడికి ఆ గ్రామంలో ఒక ఎకరం జొన్న పొలం ఓ చుట్టుగుడిసె ఉన్నాయి. వల్లగా నిగనిగలాడే మూడు పదులు దాటని భార్య — ముసలి తల్లి ఉన్నారు.

శ్రామికులు, ఆత్మీయులు చనిపోయినప్పుడు గుండె పగిలేలా ఏడుస్తారు కొంతమంది. తరువాత జ్ఞాపకం వచ్చినప్పుడల్లా ఏడుస్తారు. కాని తీరికగా ఏడుస్తూ ఉండటానికి పరిస్థితులు ఒప్పవు. ఏడుస్తూనే పని చేసుకోవాలి. ఎంతటి ఆత్మీయుడు చనిపోయినా మరునాడే పనిలోకి వెళ్ళి బిడ్డల కడుపులు నింపాలి. రంగమ్మకు అటువంటి అనుభవమే కలిగింది. కాని ఇంకొక విధంగా తటస్థ పడ్డది.

ఇంట్లో చారెడు గింజల్లేవు పావుబస్తా గింజలమ్మి శివయ్యకు వైద్యంచేయించింది. కాని లాభంలేక పోయింది. ముసలమ్మ ఏడ్చి ఏడ్చి సొమ్మసిల్లి పోయింది. గుక్కెడు గంజయినా కాచి నోట్లో పోస్తేగాని లేవలేదు. పిల్లలు లేకపోయినా తనను ప్రాణంగా చూసుకున్న శివయ్య శవం కాటికి చేరాలి.

ఎట్లా ?

ఏం చెయ్యాలి ?

రంగమ్మ ఏడ్చి ఏడ్చి కళ్ళు తుడుచుకుంటుండగా ఆమె కళ్ళు చేతులకున్న మురుగుల జత మీద పడ్డాయి. ఏడు తులాల మురుగులు, శివయ్య పెళ్ళినాడు మెడలో నాలుగు బంగారు గుండ్లూ, చేతులకు వెండి మురుగులు జత పెట్టాడు. తులం బంగారమయినా పెట్టనా అని రంగమ్మ తల్లి రాగాలు పెట్టింది.

''మెల్లగ చేయిస్త'' అన్నాడు శివయ్య. శివయ్య లాంటి బుద్ధిమంతుడు మరి దొరకడని అంతా చెప్పారు.

మూడు ముళ్ళూ మెడలో పడ్డాయి. తల మీద తలంబ్రాలు జారిపడ్డాయి రంగమ్మకు.

ఏన్నేళ్ళయినా మాట నిలుపుకోలేదని రంగమ్మ తల్లి సాధింపులు ఆ యింటి నుంచి ఈ యింటికి చేరేవి.

శివయ్య ఉగ్రుడయ్యేవాడు.

ఆ మురుగుల జత మీద కళ్ళు పడగానే కళ్ళు తుడుచుకుని దిగ్గున లేచింది రంగమ్మ. మేనమామను చేతికిచ్చి కోమటి కొట్లో తాకట్టు పెట్టి డబ్బు తెమ్మని పంపింది. మేనమామ సావయ్య చుట్టలకు తను రెండు రూపాయలుంచుకుని మిగిలిన నలభై ఎనిమిది రూపాయలు రంగమ్మ చేతిలో పెట్టాడు.

ఆ రోజుల్లో అవి చూసి చూసి ఖర్చు చేసినా కుల పెద్దలను నలుగురినీ పిలిచిన నాటికి చాలనేలేదు.

పదిరోజులు దాటగానే రంగమ్మ శరీర కష్టం చేసింది. ముసలమ్మకూ తనకూ గంజి కాచుకుని కాలం వెళ్ళదీసింది. పంట రాగానే తన మురుగులు తాను ఇంటికి తెచ్చుకుంది

ఆ మురుగులు దునుకు అడుకున్నాయని చేతులకు వేసుకుని శివయ్యను తలుచుకుంటూ దేవుడికి దండం పెట్టింది.



'కొత్తపేట రౌడీ'లో ఒక దృశ్యం

లీల గుడిసె కూడా కొట్టుకపోయిందని విని బాధపడింది జయమ్మ. "పాపం కష్టాలు ఎలా కలిసివస్తాయో చూడండి. మొదట దాని మొగుడికి ఉద్యోగం పోయింది. ఇపుడు ఇల్లు నీటిపాలైంది. పాపం. ఏ మొక్కులు పంచనపడి ఉందో" అంది భర్తతో.

పది అడుగుల ఎత్తుసున్న నీటిమట్టం తగ్గేసరికి రెండు రోజులు పట్టింది. జరిగిన జననష్టాన్నీ, పశునష్టాన్నీ, ఆస్తినష్టాన్నీ అంచనాలు వేస్తున్నారు సర్కారువారు. వరద బీభత్సం చూట్టానికి ఆ ప్రాంతానికి వెళ్లి వస్తున్నారు ఊళ్లోని కొందరు రామనాథం కూడా వెళ్లాడు. ఇంటికి వచ్చిన భర్తని లీల కుటుంబం గురించి అడిగింది. కాళ్లు కడుక్కుంటూ లీల కుటుంబం వరదలో మరణించిన విషాదవార్త చెప్పాడు.

"లీల, భర్త, అత్త—ముగ్గురూ ఇంట్లోనే సజీవసమాధి చేయబడ్డారు. బురదలో ఇరుక్కుపోయిన శవాలను తవ్వి తీసి ఈరోజు పొద్దున్నే ఒకచోట చేర్చారు. మధ్యాహ్నం మూక ఉమ్మడిగా దహనం చేస్తార్ట దిక్కులేని శవాలన్నీ కలిపి రెండు రోజులుగా నీళ్ళలో నాని, మట్టిలో కూరుకుపోయి వికృతంగా తయారయాయి శవాలు."

"హరిహరీ!" అనుకుంది జయమ్మ. 'ఎంతటి దారుణమైన చావు!'

"ఆశ్చర్యం ఏమంటే లీల కొడుకు మాత్రం బతికే వున్నాడు. కాలువ పొంగినరోజు రాత్రి వాడిని బుజంమీద వేసుకుని పక్కింటి కుర్రాడు ఆరుబయట తిప్పుతున్నాడట. పొంగివస్తున్న నీటిని చూసి, పిల్లవాడితోసహా పారిపోయి ఊళ్లోకి, మెరక ప్రాంతంలోకి వచ్చాడు. ఈవిధంగా పసివాడు బతికి బయటపడ్డాడు."

## తల్లి - ఒక మనసున విరిసిన మల్లి

"మరి ... వాడి పాలన పోషణ... బాధ్యత?" అంది జయమ్మ.

"మహిళామండలి బాలల సంక్షేమ శాఖ వారు వరదలో దొరికిన మిగిలిన అనాథ పిల్లలతో బాటు వాడిని కూడా తీసుకెళ్ళారట. ఏదైనా అనాథ శరణాలయానికి అప్పగిస్తారేమో, వాళ్ళు మాత్రం ఎన్నాళ్ళుంచుకుంటారు?" అన్నాడు రామనాథం. వాడిని గురించి లీల కన్నకలలూ, పెంచుకున్న ఆశలూ గుర్తొచ్చాయి జయమ్మకు.

జుట్టు చెదరకుండా, నవ్వు మాయకుండా గిలకలా తిరుగుతూ పనిచేసే లీల, కొడుకును బి. ఏ. చదివించాలని ఎన్ని ఊహలు చేసింది!!

'విధి ఎంత బలవత్తరమైనది! జీవితం కథలకంటె వింతైనది అంటే ఇదే కాబోలు. ఎవరి బతుకు ఎపుడే మలుపు తిరుగుతుందో ఎవరు చెప్పగలరు? ప్చ్ ... జీవితాలింతేగదా!... ఏది శాశ్వతం కాబట్టి...'

జయమ్మ మనసు వేదాంతంతో నిండిపోయింది. మరణించిన తర్వాత లీలను బాగా అర్థంచేసుకోగలిగింది ఆవిడ

*　　*　　*

వరద ప్రాంతానికి తానూ వస్తానంది జయమ్మ.

"అక్కడేముంది చూసేందుకు, జయా! రాబందులు మూసురుతున్న శవాలూ, బురదలో ఇరుక్కుపోయిన మొండిగోడలూ తప్ప ... నీ గుండె బేజారవుతుంది."

"మండలికి కూడా ఓమారు వెళ్ళాలమండండి."

"వెళ్లి?"

"రాజా ... అదే ... లీల కొడుకు, వాణ్ణి చూడాలి"

"........."

"వాణ్ణి కంటికి రెప్పలాగా కాపాడుకునేది పాపం. ఏ లోకాన్నుందో! వాడు యిలా అనాథ శరణాలయంలో వున్నాడంటే దాని ఆత్మ ఎంత ఘోషిస్తోందో?"

"మనం వెళ్ళి చూసేనంత మాత్రాన ఏమవుతుంది, చెప్పు?" నచ్చచెబుతున్నట్లుగా అన్నాడు.

"చూట్టం మాత్రం కాదు. వీలైతే ఇంటికి తెచ్చేసుకుందాం." తెల్లబోయినట్లు, నిశితంగా భార్యవంక చూశాడు.

"మీకు ఆశ్చర్యంగానే వుంటుంది. నాకు తెలుసు. మనవాళ్ళలోనే పెంపుడు వద్దన్నదాన్ని..." తలొంచుకుంది జయమ్మ. "అది బ్రతికుంటే తినో తినకో వాణ్ణి బాగానే చదివించివుండేది. మనకి దేవుడింత ఇచ్చాడు.. ఏం పోయింది? ..."

అసలుకారణం అంతమాత్రమేకాదు. ఆవిడ మనసులోని ఆరాటం మాటల్లో పెట్టలేకుండా వుంది. విధి కారణాన ఆశయాలు నశించిపోకూడదు. విలువలు గుర్తింపులేకుండా పోకూడదు. చైతన్యం అనేది ఎక్కడున్నా, ఏ కారణాన కూడా స్తంభించిపోకూడదు. లీల కన్నకలలు ఫలించాలి. ఇవన్నీ పైకి చెప్పలేక పోతోంది

మాటల్లో వ్యక్తపరచినదానికంటే, మౌనంగా దాగివున్న భావాలు గ్రహించటం చాలా తేలిక ఒక్కోసారి. రామనాథం భార్య మనసును సరిగానే అర్థంచేసుకున్నాడు.

"ఉప్పూ కారం తింటున్న మనిషివేనా నువ్వు? రోషం లేదూ? వాడు మనతో సమానమా? నీ యింటికెలా తెస్తావు వాణ్ణి?" ఆటలు పట్టించటానికన్నట్లుగా అన్నాడు.

"నన్నేం అలా దెప్పనక్కర్లేదులెండి. ఉప్పూ కారం తింటున్నాను గనకే జాతి ప్రేమా కూడా ఉన్నాయి నాలో రోషంతోబాటు లేవండి వెళదాం మరి" అంది హుషారుగా భర్త అంగీకరించాడని గ్రహించిన జయమ్మ

వారు నీటి వసతులు హెచ్చుచేశారు. సాగుబడికి అప్పులు ఇస్తున్నారు. రైతులు ఎరువులకు విత్తులకు డబ్బుకోసం వెతుక్కోకుండా ప్రభుత్వం అప్పులిస్తున్నది. ఆ గ్రామంలో ఆసుపత్రి వెలిసింది. పిల్లలకు పాలు పంచుతున్నారు. డబ్బడగకుండా పిల్లలకు చదువులు చెప్పే పాఠశాల తెరిచారు. రైతులకు సూచనలు ఉదయం లేవగానే రేడియోలో చెబుతున్నారు. ఆ గ్రామానికి ఒక టెలివిజన్ సెట్ కూడా అమర్చారు. గ్రామ సేవికలు ఇంటింటికీ వస్తున్నారు. వంటకాల్లో, కుట్టుపనుల్లో,

---

అని ఉభయతా చెప్పుకున్నారు.

అదివరకటి గ్రామమూ అనిపిస్తోంది.

రచ్చబండ దగ్గర కబుర్లు, రాజకీయాల లోకి దిగి రభస చేస్తున్నాయి.

కాని రంగమ్మ మురుగుల జతతో అవసరం ఆ గ్రామానికి తీరలేదు.

"ఇదిగో రంగమ్మా, వచ్చేవారం నాటికి ఇస్తా" నంటాడొకడు.

"రంగమ్మక్కా, ఒక నెలవృద్ధి నీకు తెచ్చి యిచ్చేవరకు. పిల్లకు శోభనం" అంటాడొకరైతు.

పిల్లకు పురుడొచ్చిందంటాడొకడు.

పిల్లగాడిని పట్నం తోలాలంటాడొకడు.

ఎవరొచ్చినా రంగమ్మదొకటే మాట. "అయ్యో! దానికేమిటంత ఇదవుతావు? తీసుకెళ్ళు" అంటుంది.

రంగమ్మ మీద ఆ గ్రామంలో ఉన్న నరపతి ఏమీ చెడలేదు. గ్రామస్థులు ఇంకా రంగమ్మను ఆశ్రయించుతునే ఉన్నారు. ఆమె మనసు చెప్పగానే ఉంది. స్ఫటిక మంత స్వచ్ఛంగానే ఉంది.

రంగమ్మకు వయస్సు అరవై దాటింది. కంటి చూపు కొంచెం తగ్గినట్టుగా ఉంది. ఒక్క పూటే వండుకుంటుంది. వెలుగు ఉండగానే తింటుంది. ఇంటి ముందున్న అరుగుమీద చీకటి పడేవరకూ కూర్చుం టుంది. ఏడు గంటలకే ఇంట్లోకి వచ్చి తలుపు గొళ్ళెం పెట్టుకుంటుంది.

రంగమ్మ ఇప్పుడు చేతికింద ఒక పిల్ల వాణ్ని పెట్టుకుంది. వాడు పొలం పనులలో సహాయం చేస్తాడు. పంటలో కొంత వాడి కిచ్చి మిగిలిన గింజ ఇంటికి చేర్చు కుంటుంది రంగమ్మ. చాలకపోయినా సర్దు కుంటుంది.

ఒకనాడు రంగమ్మకు చిన్నదు చిరిగనిది చటస్థ పడింది.

ఆ రాత్రే సోమయ్య తీసుకుపోయిన మురుగుల జత తీసుకువచ్చి ఇవ్వాల్సిన సమయం. కాని ఇంకా తీసుకు రాలేదు. ఇంతలో కామయ్య వచ్చి "పెద్దమ్మా, ఇల్లు కప్పించుకోవాలి. నీవు సాయపడు" అన్నాడు.

"సరే. రేపరా" అంది.

మరునాటి మధ్యాహ్నం వరకూ సోమయ్య రాలేదు.

కామయ్య వస్తే ఏం చెప్పాలి?

# మురుగుల జత

రంగమ్మ సీధిసంక చూస్తున్నది.

ఇంతవరకూ తీసుకు వెళ్ళిన వాళ్ళు ఇస్తానన్న వేళకే తెచ్చి యిచ్చేవారు. కాని— ఈసారి ఎందుకిలా జరిగింది?

సోమయ్య నమ్మకస్తుడు. ఒక సోమయ్య కాదు— ఈ ఊళ్లో అంతా నమ్మకస్తులే. తనవల్ల సహాయం పొందేవారు. అక్కర తీర్చుకుని తిరిగి ఇచ్చేవారు. సోమయ్య కేదో కష్టం వచ్చి ఉంటుంది. పొరుగూరికి వెళ్ళాడు. రాను వీలయిందో లేదో?

రంగమ్మ భోజనం చేసి వాకిటి అరుగు మీద కూర్చుంది.

వెలుగు జారుకుంటోంది. చీకట్లు కమ్ముకుంటున్నాయి.

రంగమ్మ బాధతో కూర్చున్న చోటి నుంచి లేవబోతుండగా కామయ్య వచ్చాడు.

"ఏం పెద్దమ్మా?"

"నాయనా, సోమయ్య తీసుకువెళ్ళాడు. నిన్న తిరిగి ఇవ్వాల్సిన రోజు. కాని ఎందుకో రాలేదు. పొరుగూరు వెళ్ళాడు. అక్కడేదో అకాల వర్షంపడి ఏర్లు పొంగి వాగులు నిండినాయట. ఇందాక ఎవరోవచ్చి చెప్పారు" అంది.

"అది నిజమే కావచ్చు పెద్దమ్మా, నా సంగతి చూడు. నా భార్యకు నీళ్ళాడ పొద్దులు. ఇల్లు కురుస్తున్నది ముందే కప్పుకోవాలి. ఆ పైన కుదరదు."

"అవును బాబూ. అందరికీ అవసరమే. రాగానే నీకే ఇస్తాను. అతడు తప్పకుండా తెస్తాడు."

"అయితే రేపురానా పెద్దమ్మా?"

"రా నాయనా!" ఆమె తలుపు గొళ్ళెంపెట్టి లోపలికివెళ్ళి జొన్న గటక తాగి పడుకుంది.

కామయ్య రంగమ్మకు భర్త వైపు దూరపు చుట్టం. రంగమ్మ అందరి లలో నాలుకలా ఉండటం అతడికి ఇష్టం లేదు. ఆ చుట్టు గుడిసె అయినా అలా గట్టిగా ఉండటం అతడి కంటికి మిర మిరగా ఉంది. ఆ కొద్ది గింజలతో కడుపు నింపుకుని ఒక మహారాణిలా ఆ గ్రామంలో పరిపాలన చేస్తున్నదే రంగమ్మ అని మనసులో బాధ.

దిక్కులేని ఒక ఆడదానికి ఇంత పరపతా?

అందరూ పొద్దున లేచి రంగమ్మను తలుచుకోవటమా?

కాని కామయ్య కూడా అలా ఆమెవల్ల సహాయం పొందినవాడే. కాని మనసులో కంటగింపుగా ఉంటోంది.

రాత్రి పన్నెండు గంటల వేళ - ఒక నిప్పుపుల్ల చుట్టు గుడిసె మీద కాల్చి పడేశాడు.

తెల్లవారేసరికి ఊరంతా గుప్పుమంది. రంగమ్మ చుట్టు గుడిసె మీద ఎవరో నిప్పు పడేశారని, కసంతా కాలి కూలిపోయిందని.

గ్రామస్థులంతా ఒక్కరొక్కరే పరుగు తీశారు గుడిసె దగ్గరికి. క్రిందతో కాలి పోయిన చెత్తంతా తోస్తే దూలాల క్రింద రంగమ్మ కాలిన వంకాయలా ఉంది.

గ్రామస్థులంతా ఆమెను దేవతలా ఊరేగించి ఊరి బయట సమాధి చేశారు. వాళ్ళు ఇళ్ళకు తిరిగి రాలేక అక్కడే నాలుగు గంటలసేపు కూర్చుని ఆమె ఆదుకున్న కుటుంబాలను గురించి చెప్పుకున్నారు. ఎవరెవరిని ఎటువంటి కష్టాలనుంచి తప్పించిందో నెమరువేసుకున్నారు. కన్నీరు కార్చారు. దిక్కులేని వాళ్ళమయ్యామని వాపోయారు

ఏన్నాళ్ళయినా ఎన్నేళ్ళయినా ఆ గ్రామంలో సాయంత్రం కాగానే "నాయనా! నీవింతగా అడగాలా? తీసుకువెళ్ళు. నీ అక్కర తీర్చుకో. ఇబ్బంది పడకు. నా మురుగుల జత వుంది చూశావా? దాన్ని మంచి మనసుతో శివయ్య పెళ్ళినాడు పెట్టాడు. ఆ మురుగుల జతలో శివయ్య మనసుంది. ఎప్పుడూ వాటితో మంచిపనులే జరుగు తాయి" అని గాలి ఈలలు వేసినట్టుగా— సాయంత్రపు వేళలో మల్లెలు విచ్చి మగం ధాన్ని ఊరిమీద వెదజల్లినట్టుగా — పాంథుడు చల్లటి పానీయం త్రాగిన తరు వాత సేదదీరినట్టుగా రంగమ్మ మాటలు సమాధి నుండి వెడలినట్టుగా అనిపిస్తుంది.

రంగమ్మ మురుగుల జత వాళ్ళ కళ్ళకు ధవళ కాంతులు వెదజల్లుతూ ఎవరినో ఆపద నుండి కాపాడుతున్నట్టుగా కనబడు తుంది.

# ఎన్నో కప్పుల కమ్మని చిక్కని టీ కోసం



మా కుటుంబానికి,
ఎన్నో కప్పుల కమ్మని
చిక్కని టీ--రుబికి
మా కృతజ్ఞతలు !




లిప్టన్ రుబీ డస్ట్

ADC/CAS.1/78 TEA

రండి' అన్నాడు వాళ్ళు ఫీజు యిచ్చి వెళ్ళిపోయేరు.

విచిత్రమైన మనుషులే వీళ్ళు! అనుకుంటూ డిస్పెన్సరీ కట్టేసి లోపల కూర్చున్నాడు. పది నిమిషాలు కాగానే విసుగొచ్చింది. అలా బయటికి వెళదాం అనిపించింది. మాట్నీకి వెళదాం అనుకుంటే తను డిస్పెన్సరీలో నాలుగుకే వుండాలి. విమలతో కార్డ్సు వేసుకుందాం అంటే ఆమె రాలేదు. తన స్నేహితుడు హరనాథ్ దగ్గరికి వెళితే? అతను ఎన్నోసార్లు రమ్మన్నాడు. మెడికల్ కాలేజీలో తామిద్దరూ క్లాస్‌మేట్స్. హరనాథ్ తెలివైనవాడు. అతని తండ్రి యీ ఊర్లో చాలా మంచి పేరు పొందిన డాక్టర్. అతనికి డిస్పెన్సరీతో బాటు, ఒక యక్స్‌రే క్లినిక్ వొక పేథాలజీ లాబ్ ఉన్నాయి. హరనాథ్ కూడా తండ్రి దగ్గర మూడో సంవత్సరంనించే ప్రాక్టీసుచేయడం మొదలుపెట్టేడు. కోర్సు పూర్తి కాకుండానే ప్రాక్టీసు చేస్తున్నావు? మనకేం అర్థం అవుతుందని? తనంటే 'యీ ప్రయివేట్ ప్రాక్టీసు చేయడానికి వొక్క నెల ఎవరిదగ్గరేనా ట్రయినింగ్ అయితే చాలు. పెన్సిలిన్, బీకాంప్లెక్సు, టెట్రమయిసిన్, యివి మూడేగదా మనం వాడేది. నువ్వో వొక్క నెల కూర్చో! అంతా నేర్చేసుకోవచ్చు' అనేవాడు. తను 'కోర్సు పూర్తికానీ' అనేవాడు.

హరనాథ్ ఎన్నోసారు తనతో అన్నాడు. అప్పుడప్పుడు యింటికొస్తూండు అంటూ. వాళ్ళ యిల్లూ క్లినిక్కూ వొకేస్థలంలో ఉన్నాయి. తను అతన్ని కలిసి దాదాపు రెండు నెలలు అయింది. యీరోజు కలుద్దామని బయలుదేరేడు. తన క్లినిక్ నించి వాళ్ళ క్లినిక్ వొక మైలు దూరం ఉంది.

బయటికి వచ్చి తలుపు తాళం వేసి అలా చుట్టూరా తిరిగి ప్రక్కవీధిలోంచి బయలుదేరేడు. రెడ్‌క్రాస్ ఉన్న షాపు ముందు రాగానే అతని కాళ్ళు ఆగేయి వొక్క నిముషం. ఆ క్లినిక్ జనంతో కిటకిటలాడిపోతూంది. ప్రతీ వాళ్ళ చేతుల్లో వొక ఖాళీ మిక్చరు సీసా, వొక నెంబరు.

ప్రొద్దున్న ఎనిమిది గంటలకు వొస్తే యితను కట్టేయడానికి రెండు అవుతుంది. అతని దగ్గర యిద్దరు కంపౌండర్లూ, యిద్దరు నర్సులూ ఉన్నారని విన్నాడు.

# ప్రాక్టీసు పెట్టిచూడు

(18వ పేజీ తరువాయి)

ఇంతమంది ఉన్నా మూడు గంటలు పడుతుందట. వొచ్చిన పేషంటు డాక్టర్ని చూసేందుకు. తనకీ యీయనకీ యీ భేదం ఎందుకు? అతను కొంచెం ముందర పుట్టేడు కాబట్టి! అంతేగద. అదే తను వొక పదిహేనేళ్ళ క్రిందట పుట్టి ఉంటే? మనస్సు కొంచెం అసూయతో నిండగా కదలిపోయేడు డాక్టర్ సుదర్శనం.

తను హరనాథ్ యింటికి వెళ్ళేటప్పటికి హరనాథ్ యింట్లో లేడు. క్లినిక్కులో ఉన్నాడని తెలిసింది. క్లినిక్‌కి వెళ్ళేడు. పన్నెండున్నర అయినా క్లినిక్ యింకా అప్పుడే తెరచినట్టు జనంతో నిండి ఉంది. తను డాక్టర్ గదిలోకి పోబోతూంటే తన కంటే ముందున్నవాళ్ళు గోలపెట్ట సాగేరు. 'యిప్పుడే వొచ్చి లోపలికి వెళ్ళిపోతున్నాడు!' అంటూ.

వాళ్ళ మాటల్ని పట్టించుకోకుండా తను తలుపు తీసుకుని లోనికి వెళ్ళేడు. హరనాథ్ వాళ్ళ నాన్నగారి కుర్చీలో దర్జాగా కూర్చొని పేషంట్సును పరీక్ష చేస్తున్నాడు. తన్ను చూస్తూనే 'గురూ నువ్వా' అంటూ కుర్చీలోంచి లేచి 'చాలా రోజులకే?' అంటూ కాలింగ్ బెల్ కొట్టి కంపవుండరు రాగానే వొక కుర్చీ తెమ్మన్నాడు.

'కుర్చీ తర్వాత- ముందు పేషంట్సును చూడు' అంటే ఎదురుగుండా ఉన్న పేషంటు చీటిలో మందు రాసి, అతన్ని పంపించేసి 'చెప్పు' అన్నాడు.

'చెప్పడం తర్వాత కానీ ముందు యీ సంగతి చెప్పు. నాన్నగారు ఏరి?'

'నా కోర్సు పూర్తయిందిగా యిక యీ జైల్లో నాన్నగారు ఎందుకుంటారు? దీన్ని నాకంట గట్టి ఆయన సుభ్రంగా ఊళ్ళన్నీ చూసేస్తున్నారు.'

'ఎన్నాళ్ళయిందేంటి అతను వెళ్ళి?'

'రెండు నెలలు అయింది. మొత్తం ఇండియా అంతా టూర్ వేసి యింకో నాలుగు నెలలదాకా రారు'

'ఎవరెవరు ఉంటున్నారు యిప్పుడు యింట్లో?'

'నేనూ నా భార్య శోభా.'

'మరి చెల్లె?'

'దాన్ని కూడా తీసికెళ్ళేరు.'

'అయితే తొందరగా పేషంట్సుని చూసేయ్. క్లినిక్ కట్టేద్దాం' అన్నాడు.

'పేషంట్సు అయిపోయి క్లినిక్ కట్టేద్దాం అనుకుంటే అది జరిగేపని కాదు' అని తిరిగి బెల్ కొట్టి కంపవుండరు రాగానే 'యింకో గంటదాకా లోనికి ఎవర్నీ పంపించకు— విజిట్‌మీద డాక్టర్ వెళ్ళేరని చెప్పి వాళ్ళను కూర్చోబెట్టు'- అని తనతో 'రా భోజనం చేద్దాం' అన్నాడు.



# ప్రాక్టీసు పెట్టిచూడు

'పాపం వాళ్ళని అలా కూర్చోబెట్టి...'

'వాళ్ళకు అలవాటే, అలా కూర్చోవడం. ఒక గంట కాదు. రెండు గంటలు కూర్చోమన్నా కూర్చుంటారు. ఏమీ అనుకోరు.'

'పాపం! ఎంత బాధతో ఉన్నారో ఏమో? చూసేయకూడదూ!'

'సుదర్శనం నువ్వు ఇప్పుడు నేర్చుకుంటావురా యీ ట్రిక్సన్నీ. వచ్చిన వాణ్ని వచ్చినట్టు పంపిస్తే పేషంట్సు యీ డాక్టరికి ప్రాక్టీసు లేదు అనుకుంటారు. వచ్చిన వాణ్ని రెండు గంటలు వెయిట్ చేయించి అప్పుడు పంపించేం అనుకో! అబ్బ! ఈ డాక్టరు దగ్గర ఏం జనం! ఎంత బాగా చూడకపోతే అంత రష్షు ఉంటుంది అని మరో నలుగుర్ని తీసుకొస్తారు. అయినా వీళ్ళకు బుద్ధిలేదుగాని ఎవడు యిచ్చినా అదే మందే! అయినా వీళ్ళు యింకేం డాక్టరూ లేనట్టు యిలా గంటల తరబడి వెయిట్ చేస్తారంటే ఏమనాలి?' అని 'యింతకీ నువ్వేం చేస్తున్నావ్?' అన్నాడు.

'క్లినిక్ పెట్టేను' అన్నాడు తను.

'నువ్వా!!!' అంటూ ఆశ్చర్యంగా చూసేడు.

'అవును నేనే. అయినా అంత ఆశ్చర్యపోతావేం?'

'ఏం లేదు నీకు బుద్ధిగా ఒక చోట కాలు కదపకుండా కూర్చోనే ఓపికవుందా?' అని.

'ఇప్పుడే కూర్చోవడం నేర్చుకున్నానులే. వారం రోజులు కూర్చోనేటప్పటికి కాళ్ళన్నీ తిమ్మిర్లు పట్టేసేయి. అది వొదిలించుకుందామనే యిలా వొచ్చేను.'

'మంచి ఉపకారం చేసేవురా బాబూ వచ్చి! నేను మిత్రుడి ముఖం అంటూ చూసి రెండు నెలలు అయింది. సినిమాకి వెళ్దాం అనుకుంటే టైటిల్సు మొదలు పెట్టేసి రెండో మూడో రీల్సు కూడా అయిపోతూంది. సినిమా హాల్లో కూర్చున్న తర్వాత అందరూ నవ్వితే నేను నవ్వుతాను కథ మొదట్నించి తెలియకపోయినా! అంటే నవ్వులో వాళ్ళకు కంపెనీ యిస్తున్నానన్నమాట' అని 'మహానుభావా! యికలేస్తే యీ లోపలి తలుపు నించి సరిగ్గా మన బెడ్ రూంలోకి వెళ్ళిపోదాం!' అని తన కన్సల్టింగు రూంలోకి ఎవరూ రాకుండా లోపలినించి గడియవేసి, బెడ్‌రూంలోకి వెళ్ళే తలుపు త్రోసి 'రాగురూ' అంటూ లోపలికి దారి తీసేడు.

హరనాథ్ బెడ్‌రూం చాలా అద్భుతంగా ఉంది. ఆ ప్రదేశంలో ఎలాంటివాళ్ళకయినా మనస్సు వశం తప్పుతుంది. తను యిదివర్లో ఎప్పుడూ యింటి మెయిన్ గేటులోంచి వచ్చేడు కాబట్టి యీ గదిలోకి రాలేదు. యీ గది చూసిన తరువాత బెడ్‌రూం అంటే యిలా ఉండాలి అన్న అభిప్రాయం కలిగింది. తను పడుక్కునే గదిని బెడ్‌రూం అని అనేందుకు మనస్సు యిప్పుడు అంగీకరించటంలేదు. అక్కడ గట్టిగా ఊపిరి పీలుస్తే శబ్దం బయటికి వినిపిస్తుంది. యిల్లు కట్టుకుని పదిహేనేళ్ళయినా గోడలకు మళ్ళీ సున్నాలు అంటూ వేయించుకోలేక పోయేరు. మంచం ఆక్రమించగా మిగిలిన ఖాళీ జాగాలో ఒక్క మనిషి నడిచేందుకు వీలవుతుంది. అందుకే ఒక్కరాత్రి తను భార్యతో మనస్సు విప్పి సంచరించలేకపోయేడు. ఇలాంటి బెడ్‌రూంలో తమా—విమలా- ఒక్క పూట ఉంటే...మనస్సు వికలం అయింది, యిది ఎంత అసంభవమో అవగాహన కాగానే.

'గురూ నడవాలి' అన్నాడు హరినాథ్.

భారంగా నడిచేం ముందర హాల్లోకి.

తను సోఫాలో కూర్చోగానే 'శోభా చూడు ఎవరొచ్చారో' అన్నాడు. వంటింట్లోంచి అతి సాధారణం అయిన చీరలో ఎర్రరంగు శరీరంతో శోభవచ్చి 'డాక్టరుగారా! ఏంటి యీ మధ్య బొత్తిగా రావడమే మానేసేరు?' అంటూ నిష్ఠూరంగా అడిగింది. 'మనవాడు క్లినిక్ పెట్టేసేడులే అది కారణం!' అన్నాడు హరనాథ్

'మీకెందుకయ్యా యీ క్లినిక్కూ-యీ బాధా. మంచి ఉద్యోగం వెతుక్కుని లైఫ్ ఎంజాయ్ చెయ్యకుండా?'

అలా అంటూంటే ఆమె ముఖం విషాదంగా తయారయింది. క్రిందటిసారి తను చూసినప్పటి కంటె కొద్దిగా చిక్కింది కూడా.

'మా శోభకు యీ మధ్య క్లినిక్ అంటే ఎలర్జీ మరీ ఎక్కువయింది.' శోభ నోరు మెదపలేదు. 'అన్నానికి లేస్తారా?' అంటూ హరనాథ్‌ని అడిగింది.

# హైదరాబాద్ నోట్‌బుక్

రాష్ట్రానికంతా వర్తిస్తుందని మంత్రి అన్నారు. ఈ నిధికి 50 వేల రూపాయలు ఉర్దూ అకాడమీ ఇచ్చిందని, హైదరాబాద్ ప్రజలు పదివేల రూపాయలు విరాళంగా ఇచ్చారని, నిధికి 10 లక్షల రూపాయలు సేకరించి, దానిపై వచ్చే వడ్డీతో దురవస్థలో వున్న రచయితలకు సహాయం చేయడం ఈ నిధి ఉద్దేశమని ఉర్దూ అకాడమీ కార్యదర్శి శ్రీచందర్ శ్రీవాస్తవ తెలిపారు. తెలుగువారికి కూడా ఇలాంటి నిధిరాదా!

**రాష్ట్ర సాహిత్య అకాడమీ బహుమతులు :**

రాష్ట్ర సాహిత్య అకాడమీ 1979 సంవత్సరం ఉత్తమ రచనలకు చెరి వేయిన్నూటపదహారు రూపాయల బహుమతులు ప్రకటించింది. శ్రీయుతులు ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి కీర్తితోరణం కావ్యానికి రాచమల్లు రామచంద్రారెడ్డి సాహిత్య వివేచన సాహితీ విమర్శకు, డాక్టర్ సి. ఆనందరామం నవల తుఫానుకు, కాశీవిశ్వనాథం నాటిక ఒక దీపం వెలిగించండికి బహుమతులు లభించాయి. ఈ బహుమతులు జనవరిలో జరిగే ప్రత్యేక సమావేశంలో రచయితలకు అందజేస్తారు.

ఈ సంవత్సరం ఉత్తమ రచయిత్రిగా డక్టర్ ఆచంట శారదాదేవిని, ఉత్తమ సంస్కృత పండితుడుగా శ్రీ తెన్నేపల్లి రామచంద్రశాస్త్రిని చెరి వెయ్యిన్నూటపదహారు రూపాయలతో సన్మానిస్తారు. శ్రీయుతులు తుమ్మల సీతారామమూర్తి చౌదరి, దీపాల పిచ్చయ్యశాస్త్రిని ఐదువందల రూపాయలతోను, శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవిని 216 రూపాయలతోను సన్మానిస్తారు. ఈ సమాచారం అకాడమీ కార్యదర్శి డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తి పత్రికా ప్రతినిధులకు తెలియజేశారు, నవంబర్ 15న.

**ఉపశ్రుతి :**

అయ్యా, మీరు ఉపశ్రుతిలో నా స్కూటరు ప్రయాణమన్నారు. నాది స్కూటరుకాదు, లూనా. కనుక హాయిగావున్నాను — అన్నారు డాక్టర్ భీమ్‌సేన్ నిర్మల్ నాతో. ఈ సంభాషణ వింటున్న డాక్టర్ పుల్లెల శ్రీరామచంద్రుడు మరి నా స్కూటరేమిటి? అనడిగారు. మీది మహాయానం నా లూనా కంటే పెద్దదిగదా! అన్నారు డక్టర్ నిర్మల్. మరి నా యానం సంగతేమిటి? అంటూ డాక్టర్ మొగిలి నాగభూషణశర్మ తన కారును చూపెరు. మీది వజ్రయానం అన్నారు డాక్టర్ నిర్మల్. ఈ చలోక్తి అంతర్యం గ్రహించిన వారంతా నవ్వారు విరగబడి.

— తిరుమల రామచంద్ర


VEP
VEP
VEP



# ప్రశ్నావళి!

కె. రామలక్ష్మి

**సి. ఎస్. విజయవాడ**

సినిమాలు అసలే తీసేస్తే కాని ప్రజలు బాగుపడరని నా నమ్మకం.

అలా తీసేయ్యకపోతే— చాలా తీసెయ్యాలి. సినిమాలొక్కటేనా జనాన్ని పాడు చేస్తున్నవి.

**టి. ఎస్. ఆర్ నాగులపల్లి**

గంటకొక పార్టీ మార్చే గుంటనక్కలు అంతరించేదెప్పుడు?

లాభం లేదండీ, ప్రజాస్వామ్యంలో పార్టీలూ తప్పవు, అధికార దాహంతో పార్టీలు మార్చే నక్కలూ తప్పరు. ఉన్న దాన్లోనే ఉత్తమం కోసం అన్వేషించాలి.

**రవి, కడప**

నాకు ఒకే ఒక స్నేహితుడున్నాడు. మా స్నేహం నాలుగేళ్లయినా చెక్కు చెదరకుండా వుంది. మీరేమంటారు?

నాలుగేళ్లకే యిలా మురిసి పోతున్నారే— నేనూ సూర్యాకాంతం వీధి బడినుంచి స్నేహితులం. బుడ్డి గచ్చకాయలు, చింతపిక్కలు ఆడి ఆడి అలసిపోయి యిప్పుడు అమ్మమ్మలం అయినా స్నేహం చెక్కు చెదరలేదు. అంచేత స్నేహానికి, కాలం కాదు కొలమానం ఆత్మీయత.

**చంద్ర, ఈపురుపాలెం**

భార్య తన భర్తను పిల్లలను సంసారాన్ని ఎంతో విజ్ఞతతో ఉన్నత స్థితిలో ప్రతిభావంతముగా తీర్చి దిద్దగల సామర్థ్యం వుండాలి.

వుండాలి. అది భర్తకీ వుండాలి. ఎందుకంటే సంసారానికి వీరిద్దరూ రెండు ప్రక్కలు.

**వి. ఎస్. నెల్లూరు**

మీరు ఎప్పుడు వంటపని,ఇంటిపని చేస్తారు కథలు ఎప్పుడు రాస్తారు?

ఒక పని చేస్తున్నప్పుడు రెండో పని చేయను! అదే ప్రిన్సిపల్.

**కె. జి. ఎస్ కె. కుప్పం**

రచయిత్రిగా రాణించాలనే వారికి వుండవలసిన లక్షణాలు ఏమిటి?

పూర్వం రాసేనేర్పు చాలేది. కాని యిప్పుడు మీరంటున్న లక్షణాలు క్షణాల మీద మారి పోతున్నాయి.

మనుష్యులంతా దేవుళ్లయితే?

మరీ డేంజరు. దైవత్వం పూర్తిగా వుండక, మానవత్వం పూర్తిగా వుండక— ఒకళ్లనొకళ్లు చంపుకుంటారు!

# హాకిన్స్®తో వంట అంటే ఆరోగ్యకరమైన వంట—అన్నింటికంటే తక్కువ ఇబ్బందులతో, అన్నింటికంటే ఎక్కువ రక్షణతో!



## పోషకాహారం పరిశుభ్రత

మామూలు వంట కంటే హాకిన్స్ ప్రెషర్ కుక్కర్ వంట మీ కుటుంబానికి మరింత ఆరోగ్యకరమైన ఆహారాన్ని సమకూరుస్తుంది. కొన్ని పోషక విలువలు, ముఖ్యంగా విటమినులు, మాంసకృత్తులు ప్రెషర్ కుకింగ్ వల్ల మరింత ఎక్కువగా నిలచి ఉంటాయని కేంద్ర ఆహార మరియు సాంకేతిక పరిశోధనా సంస్థ జరిపిన పరిశీలనవల్ల తేలింది. అంతేకాదు. హాకిన్స్ మీకు మరింతగా పరిశుభ్రమైన ఆహారాన్ని అందిస్తుంది కూడా. ఎందుకంటే ఇది 122°C ఉష్ణోగ్రతతో వండడం వల్ల ఆహారంలో సూక్ష్మజీవులన్నీ నశిస్తాయి. మామూలుగా వండితే (100°C ఉష్ణోగ్రతలో) ఆహారంలోని సూక్ష్మజీవులన్నీ నశించవని, ప్రెషర్ కుకింగ్‌లోనే పూర్తిగా నశిస్తాయని బహుశా మీకు తెలియకపోవచ్చు!

హాకిన్స్‌తోపాటు, చేసి చూడబడిన 127 వంటలుగల సరళమైన సచిత్ర బోధనాత్మక పుస్తకం ఒకటి 12 భారతీయ భాషల్లో ఇంగ్లీషుతో సహా లభిస్తుంది. దాని సహాయంతో మీ కుటుంబానికి మరింత రుచికరమైన, ఆరోగ్యకరమైన ఆహారాన్ని సమకూర్చవచ్చు.

## అతి త్వరగా వండండి

హాకిన్స్ ప్రెషర్ కుక్కర్, వంటచేసే కాలాన్ని సగానికి పైగా తగ్గిస్తుంది. హాకిన్స్ ఎన్నో ఇతర ప్రెషర్ కుక్కర్ల కంటే త్వరగా వండుతుంది. ఎందుకంటే, దీని నమూనా ఆవిరి ప్రసరించేందుకు ఎక్కువ స్థలాన్నిస్తుంది

## ఏడాదికి రూ. 200 ఆదా చెయ్యండి

హాకిన్స్ సగటున 53% కిరసనాయిలు లేదా గ్యాస్, బొగ్గు, విద్యుచ్ఛక్తి వంటి ఏ ఇతర ఇంధనాన్నయినా ఆదా చేస్తుందని శాస్త్రీయంగా వంట చేయటంపై జరిపిన పరీక్షలు నిరూపించాయి. అంటే ఒక్క ఇంధనం ఖర్చులోనే ప్రతి ఏడూ మీకు రూ. 200 లకు పైగా కలిసి వస్తుందన్న మాట. ఒక్క సంవత్సరంలో మీ హాకిన్స్ తన ధరను తానే ఆదా చేస్తుంది!

మీ ఆహారం ఖర్చులో కూడా ఆదా చెయ్యవచ్చు. ముతకవీ, చౌకలో లభించేవీ అయిన కాయ ధాన్యాలు, మాంసం మొదలైన వాటిని సరిగ్గా ఉడకవని మీరు సాధారణంగా కొనరు. కాని హాకిన్స్ ఉంటే మీరు అలాంటి వాటిని కూడా కొని మెత్తగా, రుచికరంగా ఉడికించవచ్చు

## నిర్వహణ ఖర్చులో ఆదా

హాకిన్స్ ఏమాత్రం ఇబ్బంది కలిగించదు. హాకిన్స్ గాస్కెట్, సేఫ్టీ వాల్వ్ మామూలు రకం ప్రెషర్ కుక్కర్లలోని వాటి కంటె ఎక్కువ కాలం మన్నుతాయి. హాకిన్స్‌కు వ్రాతపూర్వకమైన ఐదేళ్ళ హామీ ఉంది. హామీ ఉన్న విడి భాగాలన్నీ ఉచితంగా మార్చబడతాయి. హాకిన్స్ సర్వీసు ఎల్లప్పుడూ ఉచితమే.

భారతదేశంలోని ముఖ్యమైన పట్టణాలలో, ఫ్యాక్టరీ శిక్షణ పొందిన మెకానిక్‌లు గల హాకిన్స్ అధికృత సర్వీసు కేంద్రాలున్నాయి. వీటిలో సత్వరమైన, నిపుణమైన సేవ లభిస్తుంది.

## అతి సురక్షితమైన ప్రెషర్ కుక్కర్

ప్రత్యేకమైన నమూనా కారణంగా హాకిన్స్ ప్రమాదరహితమైనది. దీని మూతను తెరవాలంటే పక్కల నుంచి కాక పాత్ర లోపలికే దానిని దించాలి. అందువల్ల లోపలి ఒత్తిడి పూర్తిగా సురక్షితమైన స్థాయికి తగ్గే వరకు పొరపాటున కూడా మూత తెరవడానికి వీలవదు. సేఫ్టీవాల్వ్ హేండిల్ బార్ కింద ఉండటం వల్ల అది పనిచేసినప్పుడు ప్రమాదం లేకుండా ఆవిరి కిందికి తిప్పికొట్టబడుతుంది

మీ కుటుంబ ఆరోగ్య, ఆనందాల కోసం ఇప్పుడే పెట్టుబడి చేయండి—హాకిన్స్ ప్రెషర్ కుక్కర్ కొనుక్కోండి.




ఉత్పత్తి చేసేవారు: ప్రెషర్ కుక్కర్స్ & అప్లైయన్సెస్ లి. పి. ఒ. బాక్స్ 1542, బొంబాయి 400 001.
ఈ క్రింది వాటికి రిజిస్టర్డ్ వాడకందారులు: ® హాకిన్స్ & హాకిన్స్ యూనివర్సల్ అనే రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కులు © 1979 కాపీరైట్.

# అవీ...ఇవీ...అన్నీ

## వెంకట్ అవార్డు కార్టూన్ల పోటీ

కీ. శే. వెంకట్ పేరిట అవార్డుల బహూకరణకై కార్టూన్ల పోటీనిర్వహించి న్యాయనిర్ణేతల సిఫార్సుల ప్రకారం అత్యుత్తమ కార్టూనుకు రు. 200 లు, ఆతర్వాత మూడు ఉత్తమ కార్టూన్లకు ఒక్కొక్కదానికి రూ. 100ల చొప్పున రూ. 500ల మొత్తాన్ని నాలుగు నగదు అవార్డులుగా ఇవ్వడానికి సాధనసమితి [హైదరాబాదు] నిశ్చయించింది.

మూడు రూ. 100ల అవార్డులలో ఒకదానిని 1979వ సంవత్సరంలో వివిధ తెలుగు పత్రికలలో ప్రచురితమైన కార్టూన్లలో ఉత్తమ ఎంట్రీగా ఎన్నిక చేసే కార్టూనుకై ప్రత్యేకించారు. కాబట్టి మూడు అవార్డుల నిమిత్తం కొత్త కార్టూన్లతో పాటుగా ఒక అవార్డు కొరకు ఈ సంవత్సర కాలంలో ప్రచురితమైన కార్టూన్లు కూడా పంపవచ్చు.

ఎంట్రీలను 1980 జనవరి 16వ తేదీవరకు కార్యదర్శి, వెంకట్ అవార్డు కార్టూన్ల పోటీ, 1—1—336/20, వివేకనగర్, చిక్కడపల్లి, హైదరాబాదు—500020 చిరునామాకు పంపాలి అని శ్రీ టి. జనార్ధనరావు సాధనసమితి తరఫున తెలియజేశారు



చిప్రూడలో అమధ్య జరిగిన స్టేట్ బ్యాంక్ వార్షికోత్సవంలో కుమారి కె. మృదుల తన నృత్య ప్రదర్శనతో పలువురి ఆశీస్సులు పొందింది.



రాజమండ్రి కళాదర్బార్ లో బాలికల పోటీలో ఉత్తమ నర్తకిగా ఎన్నికై 'నాట్యబాల'గా పేరు పొందిన బేబీ బి. అనిత. వయసు 7 సంవత్సరాలు.

## చంద్రజ్యోతి

ప్రముఖ యువ కవి శశికాంత శాతకర్ణి వచన కవితా సంపుటం. 80 పుటలు గల పుస్తకం మా కార్యాలయం చేరింది. ఇందులో భావ పూరితమైన కవితలు, మూడు డజన్లకు పైగా వున్నాయి. బొమ్మలు 'ఆనంద్'. వెల రూ. 6 లు. ప్రతులకు కళాకేళి ప్రచురణలు పిఠాపురం (ఆంధ్రప్రదేశ్)కు వ్రాయవచ్చును.

## కలతల కొలతలు

శ్రీ కోటపాల్ దేవరాజా వచన కవితా సంపుటం 70 పేజీల పుస్తకం మా కార్యాలయం చేరింది. ఇందులో రచయిత అప్పుడప్పుడు వ్రాసి పాఠకుల ఆదరణ పొందిన చక్కని కవితలు, కొన్ని కొత్త కవితలు అన్నీ కలిపి 124 వున్నాయి. ప్రతులకు రచయిత పేర యల్. ఐ. జి. హెచ్. క్వార్టర్స్, లబ్బీపేట, విజయవాడ—10 కి వ్రాయవచ్చును.


**Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.**

## తల్లి ఎంతో తనయుడు అంతే !

"మా అబ్బాయిలందరూ నా మోస్తరే ! నాకు టెన్నిస్ ఎంతో ఇష్టం." వారికీ అంతే. ఎప్పటినుంచో నాకు ఇష్టమయినది, వారికీ చాలా ఇష్టం—మాల్టోవా."

అంటారు శ్రీమతి అమృత్‌రాజ్, ప్రసిద్ధ భారతీయ మహిళా టెన్నిస్ క్రీడాకారుల్లో ఒకరు.



"మాల్టోవా అన్నా టెన్నిస్ అన్నా మా కుటుంబానికి చాల ప్రీతి"

అని లయ కలుపుతారు ఆనంద్ అమృత్‌రాజ్ భారతీయ ప్రముఖ అంతర్జాతీయ టెన్నిస్ క్రీడాకారుడు.



# మాల్టోవా

## చురుకయిన జీవితానికి శక్తినిచ్చే రుచికర పానీయం

శ్రీమతి అమృత్‌రాజ్. ఆనంద్ అమృత్‌రాజ్-పేరెన్నికగల తల్లి. పేరెన్నికగల తనయుడు. టెన్నిస‌లో ప్రీతి. చురుకుతనానికి ఉత్సాహము మాల్టోవాలో ప్రత్యేక అభిరుచి-కుటుంబంలో తరగని పరంపరను కొనసాగించే తరాలు.

శ్రీమతి అమృత్‌రాజ్‌కు మోస్తరు ఆనంద్‌కు కూడా తెలుసు—మాల్టోవాలోని శరీర దార్ఢ్యతనిచ్చే ప్రొటీన్‌లు. ఆరోగ్యాన్ని నిలబెట్టే విటమిన్లు. ఖనిజాలు చురుకుదనాన్నిస్తాయని ... విజయ సాధనకు అదనపు శక్తి లభిస్తుందని.... విజేతలమవుతామని. టెన్నిస పోటీ ప్రపంచాన్ని అమృత్‌రాజ్ కుటుంబం ఇంత ప్రభావితం చేయటంలో ఆశ్చర్యం లేదు. ఇప్పటికి రెండు తరాలవారు విజయంలోని ప్రత్యేక రుచిని చవిజూచారు !

500 గ్రాములు రు. 14.49 స్థానిక పన్నులు అదనం






# మాల్టోవా

విజయంలోని ప్రత్యేక రుచిని చవిజూచేందుకు

JIL జగత్‌జిత్ ఇండస్ట్రీస్ లిమిటెడ్

ASP/JIL/12-203 Tel

స్త్రీ మనోభావాలకు
అందమైన
భాషలు ఎన్నెన్నో.

అందులో
విమల్
ఒకటి!




100% పోలియెస్టర్ చీరలు

వీటికోసం మీ విమల్ రిటైల్ షాపులో అడగండి: సారికా, డివైన్ జ్యూయల్, రాయల్ జెమ్, పోలియెస్టర్ టిష్యూ క్రేప్.
ఇంకా సిల్క్ సిలీమోర్, స్వీట్ సాఫ్టీ, వినోల్టా, క్లాసిక్ మరియు ఫ్రెంచ్ షిఫాన్.

VIMAL/SS/4/79 TEL